

ది 23–1–94 న జరిగిన ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి వార్షిక సమావేశములో
చిత్తూరు జిల్లాకు చెందిన సీనియర్ ప్రచారకులు శ్రీ జె. దొరస్వామిరెడ్డిగారికి సన్మా
నము జరిగినది. ఇందులో శ్రీ కె. కె. ఆచార్య, శ్రీ ఎల్. బుచ్చినాయుడు,
శ్రీ సుందరమూర్తి మరియు చిత్తూరు జిల్లా ప్రచారకులు పాల్గొనిరి.

టెలిగ్రామ్: హిందీ సంఘ్ ఫోన్ : 36866

# 479

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

ఫిబ్రవరి—1994

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి


దక్షిణ భారత హిందీ ప్రచార సభ—ఆంధ్ర

ఖైరతాబాద్, హైదరాబాద్—500004


సంవత్సర చందా 40—00 రూ॥

విడిప్రతి 4—00 రూ

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings Dis No. 30/55 dated 6th January-1955

# ఈ సంచికలో

సంపాదకీయం

# ఎటు పయనం?

భారత దేశమంతా ఒక్కటేననీ, భారతీయ సంస్కృతి అతి పురాతనమైనదనీ, అనేకత్వంలో ఏకత్వం దాని లక్ష్యమనీ అనాది కాలంగా మనం భావిస్తూ వస్తున్నాము. మన ఆచార వ్యవహారాలూ, మన ఆలోచనా విధానాలూ అందుకు దోహదం చేస్తూ మనకెంతో ప్రేరణ కలిగిస్తున్నవి. ఎన్ని వొడిదుడుకులు వచ్చినా ఎంత మంది విదేశస్థులు మన మీద దండయాత్రలు చేసినా వాటినన్నింటినీ ఎదుర్కొని దేశం ఏకంగా నిలబడింది. దానికి మన సంస్కృతి కారణం మనం ఏకచ్ఛత్రాధిపత్యాన్నీ చూశాము. గణతంత్ర విధానాన్నీ చూశాము. అయినా రాజకీయంగా ఏర్పడిన ఆ విధానాలు జాతిని విభజించలేదు. ఏవో కొద్ది కొద్ది మార్పులూ, వైరుధ్యాలూ జాతిలో ఏర్పడినా మూల భూతమైన సమైక్యతకు భంగం వాటిల్లలేదు. చాలాకాలం పరుల దాస్యంలో మ్రగ్గి అకుంఠిత కార్యదీక్షతో అనేక త్యాగాలుచేసి, మనదేశం స్వతంత్ర దేశమయింది. రాజ్యాంగాన్ని ఏర్పాటు చేసుకొన్నది. ప్రజాస్వామ్య విధానాన్ని అనుసరిస్తున్నది. ప్రపంచంలో పెద్ద ప్రజాస్వామ్య దేశమని పేరు తెచ్చుకున్నది. మనది చాలా విశాలమైన దేశం. వివిధ ప్రాంతాలూ, వివిధ భాషలూ, వివిధ జాతులూ ఉపజాతులూ, వివిధ ఆచార వ్యవహారాలూ కలిగిన దేశం. అయినా సాంస్కృతికంగా ఒక్కటిగా పెరిగిన దేశం. ఇది ఈ దేశానికి గల ప్రధాన లక్షణం, విశేష గుణం

మన రాజ్యాంగం నిర్దేశించిన ప్రజాస్వామ్య మార్గంలో మనం పయనిస్తున్నాము. కాని మనలోని స్వార్థం, రాజకీయ కాంక్ష, అధికార వాంఛ నిమిష నిమిషానికి అవరోధాలను కల్పిస్తున్నది. ప్రజాస్వామ్యంలో ఎన్నికలకు ప్రధాన స్థానముంటుంది ఎన్నికల ద్వారానే ప్రభుత్వాలు ఏర్పడుతుంటవి, అంతరిస్తుంటవి. అదే ఈ విధానంలోని ప్రత్యేకత. కాని ఆ ఎన్నికల యంత్రాంగాన్ని భ్రష్టు పట్టించడానికి ఈనాడు ఎన్నెన్ని కుతంత్రాలు, ఎన్నెన్ని జాతివిచ్ఛిన్నకర విధానాలు అవలంబించబడుతున్నవో చూస్తుంటే

జుగుప్స కలుగుతున్నది. కులాల పేరిట, ఉపకులాల పేరిట, ప్రజలను ఉద్రేకపరచి తమ పబ్బం గడుపుకొని, తాము నాయకుల మనిపించుకొనుటకు కొంతమంది చేస్తున్న చౌకబారు చర్యలు విపరీతంగా పెరుగుతున్నది. భాష పేరిట, కులం పేరిట, ప్రాంతం పేరిట, ఉపకులాల పేరిట జాతిని ఛిన్నాభిన్నంచేసి తాత్కాలికంగా పదవులు సంపాదించడానికి చేస్తున్న ప్రయత్నాలు వెర్రితలలు వేస్తున్నవి. హింసను ప్రకోపింపచేస్తున్నవి మారణ హోమాన్ని పెంపొందింప చేస్తున్నవి. కులాలు కులాలు కొట్టుకొనే వాతావరణం ఏర్పడుతున్నది. దొంగవోట్లు వేయడం, దౌర్జన్యాలు చేయడం, హత్యలకు పాల్పడడం, ఒకరినిచూస్తే ఇంకొకరు భయపడే వాతావరణాన్ని సృష్టించడం, గూండాయిజం పెచ్చు పెరిగిపోతున్నవి. ఇది దేశానికి, జాతికీ మంచిదిగాదు డబ్బున్నవాళ్లు దొంగ సభ్యుల్ని చేర్పించడం, ఆ సభ్యుల పేరిట ఎన్నికలు జరిపించడం, అందుకు అనేకమైన తప్పు మార్గాలను అనుసరించడం రాజకీయ సంస్థల్లోనే గాక అన్ని సంస్థల్లోనూ పెరుగుతున్నది. దేశసమైక్యత ప్రధానం, దానికే విఘాతం కలిగిననాడు ప్రజాస్వామ్య విధానం సఫలం గావడం, దేశసమైక్యత స్థిరంగా నిలవడం చాలా కష్టం. చిన్న చిన్న విభేదాలు ఎన్ని వున్నా, ఆ విభేదాలను పెంచడంగాక సమన్వయభావంతో వాటిని సరిజేయడానికి ప్రయత్నించడం ఎంతైనా అవసరం. అందుకు జాతి పునరంకితం గావడం అవసరం. ఆ మార్గంలో పయనించడం మన ముఖ్య కర్తవ్యం.

# సాహిత్యవీధి

## వ్రతసాహిత్యంలో అనంతవ్రతోపాఖ్యానం

భాగవతుల అచ్యుతరామశాస్త్రి

హిందూ సమాజమంతటా ఇష్టార్థ సిద్ధికి, పుణ్యలోక ప్రాప్తికి చేయబడే విశేష పూజా విధానమే వ్రతం. ఈ వ్రతాలను నిత్యాలు, నైమిత్తికాలు, కామ్యాలు అని మూడు విధములుగా వర్గీకరింపవచ్చును. వీటిలో కొన్ని పురుషులు మాత్రమే ఆచరింపదగినవైతే, మరికొన్ని స్త్రీలు మాత్రమే ఆచరింపదగినవి. ఇంకొన్ని స్త్రీ పురుషులిరువురూ సమానంగా ఆచరింపదగినవి ఉన్నాయి. చాంద్రాయణ వ్రతాదులు నిత్యాలుగాను, వినాయక వ్రతాదులు నైమిత్తికాలుగాను, సత్యనారాయణ వ్రతాదులు కామ్యాలుగాను ఉదాహరింపవచ్చును.

నిఘంటువులు వ్రతమనే పదానికి సంస్కృత సమమని, విశేష్యమని పేర్కొన్నాయి. దీనికి 'నోము' తెలుగు పర్యాయపదం.

ఒక తరానికి ముందు తెలుగునాట ఈ వ్రతాల ఆచరణ ఎక్కువగానే ఉండేది. నవ వధువు మంగళ గౌరీ వ్రతంతో ఆరంభించి ఎన్నెన్నో వ్రతాలు చేపట్టేది. ఆమెకు భర్త బాసటగా నిలిచేవాడు. క్రమంగా ఈనాడు జీవితంలో వేగం ప్రధాన స్థానాన్ని ఆక్రమించడంతో ఈ వ్రతాల జోలికి పోతున్నవాళ్ళు చాలా తక్కువవుతున్నారు. ఈనాటికీ వరలక్ష్మి వ్రతం, గౌరీవ్రతం, సత్యనారాయణవ్రతం, వినాయక వ్రతం, వంటివి ప్రచురంగానే ఆచరింపబడుతున్నాయి.

తెలుగు దేశంలో ప్రసిద్ధంగా ఆచరింపబడే వ్రతాలలో 'అనంత పద్మనాభ వ్రతం' ఒకటి. దీన్ని భాద్రపద శుద్ధ చతుర్దశినాడు ఆచరిస్తారు. ఆ అనంతుని సేవించినవారికి సకలైశ్వర్యములు సిద్ధిస్తాయని మన ప్రాచీనుల విశ్వాసం. ఇది భార్యాభర్తలిరువురూ చేయదగిన వ్రతం.

వ్రతకథలేవీ తెలుగు సాహిత్యంలో ప్రబంధాలుగా చోటు చేసుకోలేదు. కేవలం అనంతుని వ్రతకథ మాత్రమే ప్రబంధంగా తెలుగు సాహిత్యంలో అవతరించింది.

అనంతుని అనంతశీలంలోని భాగంగానే వెలుగులోకి రాకుండా, కనీసం కవుల చరిత్రలలోకి కూడా ఎక్కకుండా నిలిచిపోయిన శ్రీ బోడి తిరుమల రాయడు రచించిన 'అనంత వ్రతోపాఖ్యానము' అనే ప్రబంధం మద్రాస్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉంది. ఇది మద్రాసు గ్రంథాలయంలో ఉండడం వలన ఆంధ్ర పాఠక లోకానికి పఠనపాఠనాదులకు అందుబాటులో లేకుండా పోయింది.

అధ్యాపకులు, ఆం. ప్ర. గురుకుల జూనియర్ కళాశాల, రంపచోడవరం—533 288

మాతృకా వివరణ :

జోడి తిరుమలరాయని అనంత 'వ్రతోపాఖ్యానం' అనే ప్రబంధం తాళపత్ర రూపంలో మనకు లభిస్తున్నది. ఇది ఒకప్పుడు మద్రాస్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో 329 క్రమ సంఖ్యతో యుండేది. దరిమిలా దీనిని శ్రీ వేంకటేశ్వరా ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, తిరుపతికి తరలించినారు. ఇది 16 1/4 + 6 = 1 3/8 అంగుళముల ప్రమాణ ములో ఉండు ఇరువు పేజీకి ఆరు పంక్తుల చొప్పున 196 పేజీలు కలవు. వెరసి 196 × 6 = 1176 పంక్తులున్నవి. రెండవ ఆకు మరియు చివరి ఆకులు లేవు. గ్రంధము మాత్రము సమగ్రము. గ్రంధపాఠాలు అచ్చటచ్చట చూపట్టుచున్నవి.

అనుబంధ పుస్తకలు

దీనికి పుత్రికా స్థానముగా మరియొక వ్రాత ప్రతి మద్రాస్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందే లభించుచున్నది. ఇది కాగితపు వ్రాతప్రతి. గ్రంధ సంఖ్య 328. ఇది 11 1/8 × 6 7/8 అంగుళముల ప్రమాణములో నున్నది పేజీలు 162. పేజీకి సుమారు ఇరువదియొక్క పంక్తులు గలవు. వ్రాత ఒకమాదిరిగా నున్నది. తప్పులు ఎక్కువ నున్నవి గ్రంథము సమగ్రము

ఈ కాపు ప్రతి నమూనా పడియొక ప్రతిని గ్రంధాలయాధికారులు శ్రీశీర్థం శ్రీధర మూర్తిగారి చేత తిరిగి వ్రాయించిరి. బహుశః కాగితపు ప్రతుల రక్షణము నిమిత్తము ఈ కార్యము జరిగి యుండును. ఈ ప్రతి ది 4–7–1964 నాటికి పూర్తియైనట్లు గ్రంధాంత మందలి వ్రాతలవలన తెలియుచున్నది. వ్రాత ప్రతిలో పద్యనామములు పేర్కొనబడలేదు. కవి అనేక ఛందో విశేషము లను చూపినను శ్రీశీర్థంవారు మాత్రము ప్రసిద్ధము లైన కొన్నింటికి ఛందో నామములను సూచించిరి.

గద్య పద్యముల సంఖ్య :

ఈ ప్రబంధమున మొదటి ఆశ్వాసమున 215, రెండవ ఆశ్వాసమున 166, మూడవ ఆశ్వాసమున 255, నాల్గవ ఆశ్వాసమున 155 ఐదవ ఆశ్వాసమున 151, వెరసి 942 గద్యపద్యములు మాత్రము ప్రస్తుతము లభించుచున్నవి.

గ్రంథ పాతము

ప్రథమాశ్వాసమున 181వ పద్యం ఆట వెలదిలోని మొదటి రెండు పాదములు లభించుట లేదు. అట్లే ద్వితీయాశ్వాసములోని శీల కౌండిన్యుల వివాహానంతర సందర్భమున సీస పద్యం నాలుగు పాదాలతో మాత్రమే కనిపించుచున్నది. అను సంధానముగా ఉండవలసిన ఆట వెలదియో, తేట గీతియో లభించుటలేదు. పిమ్మట కథా భాగము కూడ కొంత లోపించినది.

ఆద్యంత పద్యములు :

ఒకటవ ఆశ్వాసం ఒకటవ పద్యం "శ్రీ కమనీయ విగ్రహ"....అను ఉత్పలమాలతో ఆరంభమై పంచమాశ్వాసంలోని "ధరధర మురహర....అను సీసముతో ప్రబంధం ముగింప బడింది.

భాషా విశేషములు:

వ్రాత ప్రతియందు కవి ప్రయోగించిన వివిధ పదములను బట్టి ఇది ప్రాచీన కావ్యమని యూహించుటకు దోహదపడుచున్నది కట్ట కడబ్బులు (కంటకములు), సొబగె పడదగా

(కొనబగేర్పడగా), కంత్తు —(కంతు), కాంచ్చి —(కాంచి) హేమంబు జేసి— (హోమంబు జేసి) అష్టోత్తరశత— (అష్టోత్తర శత) ఇత్యాదిగాగల అనేక భాషావిశేషములు కలవు.

కవి—కాలము

కవి తిరుమల రాయుడు తన ప్రబంధంలో పోతన వరకు గల పూర్వకవులను స్తుతించాడు. కావున కవి పోతన తరువాత కాలం వాడని ఊహింపగలుగు చున్నాము. సరియైన కాలమును నిర్ణయింపవలసి యున్నది.

కృత్యాది యందుగల "అట్టి దంపతులును... ఇత్యాదిగాగల పద్యమును బట్టియు ఆశ్వాసాంత గద్యమును బట్టియు, అనంత వ్రతోపాఖ్యానాన్ని రచించిన కవి "బోడి తిరుమల రాయడని" తెలియు చున్నది.

తల్లిదండ్రులు— గురువు:

"సీతి పరుండారాయలు ... ఇత్యాదిగాగల పద్యమువలన ఇతని తల్లి వెంకాయమ్మ, తండ్రి రాయడు అని ప్రస్ఫుటమగు చున్నది. "అనఘుని మదీయ వంశమునకుం.... మొదలుగాగల పద్యము వలన వెంకటేశ దీతని గురువని తెలియు చున్నది. కృత్యాదిన గల 'సౌరగాణాపత్య సౌగత చార్వాక, మతశైల కులిశంబు మాధ్వహితము'... అనుటను బట్టి తిరుమల రాయడు మధ్వమతమునకు చెందినవాడని తెలియుచున్నది.

పాండిత్యం

ఆశ్వాసాంత గద్యం ఆధారంగా తిరుమల రాయడు హనుమదుపాసకుడనియు, సరసకవితా విశేషములతో ఒప్పారెడి వాడనియు బుధజన విధేయుడనియు, 'యథోక్త వాచాదిత్య' అను బిరుదము ధరించినవాడనియు తెలియుచున్నది. కావ్యంలో ఎక్కడా కవి తన గురించి తెలియ జేయనందున కవికి కీర్తికాంక్షపట్ల అంతగా ఆసక్తి లేదని చెప్పవచ్చును.

ఇతర రచనలు :

పిన్న వయసున మదిలోన ప్రీతి పొడమ... ఇత్యాదిగా గల ప్రథమాశ్వాస పద్యమును బట్టి కవి తిరుమలరాయడు 'రాఘవ శతకమును' బాల్యమునందే రచించి నాడనియు దానిని రామునకంకితము జేసినాడనియు తెలియుచున్నది.

కృతిపతి :

'ఎంతయు వేడుక శ్రీమద
నంత వ్రత కల్పమే నొనర్తు దెనుగున
శ్చింత మతి దాని సీతా
కాంతున కర్పణము సేతు కవులౌ నన న్.'

అను పై పద్యమువలన తిరుమలరాయ డీ ప్రబంధమును శ్రీరామచంద్రున కర్పణ జేసినట్లు తెలియుచున్నది. పరిపూర్ణ మానవత్వపు మూర్తి భవించిన రామునిపట్ల ఆసక్తి కలిగి, ఆ రామునకే అర్పణ చేయడంలో ఔచిత్యం కనబడుతోంది.

ఇతి వృత్తం— మూలగ్రంథం :

అనంత వ్రతకథ సంస్కృత భవిష్యమహా పురాణం, ద్వితీయ, భాగం, ఉత్తర పర్వం; రేవాఖండంలో ఉంది. నాగ్ పబ్లిషర్స్ వారి గ్రంథంలో ఈ వ్రత కథ 73 శ్లోకాలతో చెప్పబడింది. అందు శ్రీకృష్ణుడు ధర్మరాజునకు చెప్పుచున్నట్లుగా సూతుడు శౌనకాదులకు చెప్పి నట్లున్నది.

''అనంత వ్రత మస్త్యన్య త్సర్వ పాపహరమ్ శివమ్
సర్వకామప్రదం నృణాం స్త్రీణాంచైవ యుధిష్ఠిర''
అనే శ్లోకంతో ప్రారంభమై

సంసార సాగర గుహాం సుసుఖం విహర్తుం
వాంఛంతి యే కురుకులోద్భవ శుద్ధ సత్త్వాః
సంపూజ్యతే త్రిభువనేశ మనంత దేవం
బధ్నంతి దక్షిణకరే వరదోరకం మే''.

అనే 73వ శ్లోకంతో ముగియు చున్నది,

అర్థమై తగునట్టి యాభవిష్యోత్తర
మను పురాణంబు నందనఘములను
సకల ధర్మన్యాయ శాస్త్రరీతి హాసముల్
వినిర వ్రతంబులు విశదముగను

అనె జెప్ప, బడును మరి విశేషముగా ననం
త వ్రతంబు నాగ సువ్రతంబు
దాని విస్తరించి తగ రామభద్రుని
కరుణ చేత దెస్సనుగా నొనర్తు అని

చెప్పట వలన కవి సంస్కృత భవిష్యోత్తర పురాణ మందలి కథను మూలముగా తీసుకొని తెనిగించినాడని తెలియు చున్నది.

**కథ :**

ధర్మరాజు నారదుని ఉపదేశం ప్రకారం తన తమ్ముల సహాయ సహకారాలతో రాజసూయ యాగాన్ని చేశారు. యాగమునకు ఆహూతుడైన దుర్యోధనుడు మయసభలో అవమానమంది జూద మునకు ధర్మజుని ఆహ్వానించినాడు, వారి సంప దలను అపహరించి అరణ్యముల పాలు చేసెను. అరణ్యవాసము చేయుచున్న ధర్మరాజునకు శ్రీకృష్ణుడు అనంతవ్రత వైభవమును వివరించెను.

దీక్షా సుమంతులకు లేక లేక కలిగిన సంతా నం 'శీల' శీల పుట్టిన కొంత కాలానికే సుమంతుని భార్య దీక్ష మరణింపగా అతడు 'కర్కశ' యను మరొక స్త్రీని వివాహమాడెను. శీల పెరిగి పెద్దదై అందచందాలతో సౌశీల్యములో మేటిదయ్యెను. తండ్రి ఆమెను కౌండిన్యునకిచ్చి వివాహంచేసెను. కౌండిన్యుడు తన భార్యను తీసుకొని నిజ నగర మునకు వెళ్ళుచు మార్గ మధ్యమున ఒక్క వనములో విడిదిచేసెను శీల ఆ వనములో వ్రతమాచరించు చున్న మిగిలిన స్త్రీలను గాంచి వ్రతము యొక్క గొప్ప తనమెరింగి తాను కూడా దాని నాచరించి తోరమును ధరించెను.

కౌండిన్యుడు ఆతోరమేమని ప్రశ్నించి, అకా రణ రోషముతో తోరమును నిప్పులలో పడవేయగా శీల వెంటనే దానిని గ్రహించి పాలలో ముంచి సంరక్షించెను. నాటి నుండి కౌండిన్యునకు కష్ట ములారంభమయ్యెను. సంపదలన్నియు క్రమ క్రమముగా హరింపజొచ్చెను. మనశ్శాంతి కొరవడిన కౌండిన్యుడు కాననముల పాలయ్యెను. ఫల వ్యర్థములుగా నున్న మామిడిచెట్టు ఆవు, ఎద్దు, ఆసారద్వయము, గజరాజు, గాడిదలను చూచుచు చివరకు ఒక వృద్ధ బ్రాహ్మణుని దరిచేరి ఆయన వలన అనంతుని దర్శన మొందెను. చివరకు అనంతుని కృపాకటాక్షములను పొంది ఇంటికి చేరి అనంతవ్రతమాచరించి తన పూర్వస్థితిని పొందెను. అంత్య కాలంలో నక్షత్రస్థానాన్ని పొందినాడు. స్థూలంగా ఈ వ్రతకథ ఇది. ఇది భవిష్యోత్తర లోని కథ.

ప్రస్తుత ప్రబంధమందలి మార్పులు :

కవి తిరుమల రాయడు మూలకథకు సమీప ముగా అనువదించుచు ప్రబంధ లక్షణములతో తీర్చిదిద్దినాడు. వర్ణనా బాహుళ్యము కల గ్రంథ ముగా ఇది ఒప్పుచున్నది. పుర వర్ణన, వర్షఋతు

వర్ణన, వన, జల, వర్ణనలు, సూర్యోదయ చంద్రోదయాది వర్ణనలు, వివాహము, రతీ వర్ణన ఇత్యాదు లనేకము కలవు.

**అదనముగా :**

మూలం కథలో లేని కొన్ని విషయాలను ప్రస్తుత కథకు సొంపు చేకూర్చే నిమిత్తం ప్రవేశ పెట్టినాడు. అట్టివానిలో 'నారదుడు ధర్మజునకు రాజ ధర్మములుపదేశించుట' ఒకటిగా చెప్పవచ్చును. ఈ విధంగా మూలంలో లేని విషయాలను కవి భారతం నుండి దిగుమతి చేసుకొన్నాడని తెలియు చున్నది.

**ఔచిత్య భరితముగా :**

మయసభలో దుర్యోధనుని పరాభవమునందు

'పునఃస్సర్వే నృపాశ్చైవ ఋషయశ్చ తపోధనా
అవహాసం తదా చక్రుః ద్రౌపద్యాది సులోచనాః' అని యున్నది.

రాజులందరూ ఋషులు, తపోధనులు, ద్రౌపది మొదలుగాగల స్త్రీ లందరూ నవ్విరని పరిహసించిన పరిహసింప వచ్చును గాని ఋషులు, తపోధనులు పరిహసించుట తగని పని.

ఈ సందర్భంలో కవి 'పరగనవ్విరి ద్రౌపది పవనసుతులు' అని ద్రౌపదీ భీములు మాత్రమే నవ్వినట్లు కవి ఔచిత్య ప్రాయముగను, సందర్భోచితముగను తెనిగించెను. ప్రబంధమందలి కథా విషయము వాస్తవమునకు ద్వితీయాశ్వాసము నుండి ప్రారంభమయినది.

పై విధంగా కవి ఔచిత్యానౌచిత్యములనెరింగి అవసరమైన చోట్ల కొన్ని మార్పులు చేయుచు, విపులీకరించుచు, కథను విస్తృత పరచినాడని చెప్పవచ్చును.

స్త్రీల సంబోధనలో పర్యాయ పదములుగా కవి ఈ గ్రంథంలో అనేక పదాలను ప్రయోగించడం కావ్యంలోని మరొక విశేషం. రమణీయార్థకాలు, లాలిత్యాలూ అయిన పదాలెన్నో ఇందు ప్రత్యక్ష మవుతాయి. తరుణి, లలన, చెలువ, అతివ, మగువ కోమలి, చెలియ, పొలతి కలికి, సతి, సఖి, చెలి, నాతి, వేనలి, లలన, లతాంగి, తన్వి, కాంత, గరిత, ముదిత, చాన, యోష, సుందరి, లలామ ఇత్యాది పదాలు సుమారు 50 కి పైబడి ఉన్నాయి.

**కవి పాండిత్య ప్రతిభలు :**

**రసము :**

ఇందలి నాయిక 'శీల' భక్తిపూరిత శృంగార నాయిక. కవి ఈ ప్రబంధమును శృంగార ప్రబంధ మని పేర్కొనినాడు శృంగార నాయికయగు శీలకు అనంతుని పై గల ప్రేమ మాధుర్యము అనంతము. ఇది, మోక్ష ప్రతిపాదితమైన ప్రబంధము.

**అలంకారము :**

కవి తన కావ్య కన్యకు అమూల్యమైన ఆభరణముల నొసంగి సర్వాంగ సుందరముగా తీర్చిదిద్దినాడని చెప్పవచ్చును... 'కలికి వాతెఱ తోడఁ గడఁగి తాఁజగడించి.

పగడంబు ఖండింపఁబడియె నంత...' అను మరి స్త్రీల సౌందర్య వర్ణనయందు హేతూత్ప్రేక్ష కలదు.

ఇటులనే ఉపమ, లోకోక్తి ముక్త పదగ్రస్తం ఇత్యాదిగా గల కొన్ని అలంకారములను పేర్కొని నాడు.

ఛందస్సు :

సంస్కృత కవులు కూడా వాడని వివిధ సంస్కృత ఛందస్సులను చూపుటలో ఛందోలక్షణ గ్రంథమునకు ఇది ఉదాహరణ ప్రాయమని చెప్పుట అతిశయోక్తి కాదు. కవి కందపద్యాలను అధికంగా ఉపయోగించి (227) తనకు కందపద్యాల పట్ల గల మక్కువను ప్రదర్శించాడు. కవి మొత్తం 40 ఛందోరీతులను ప్రయోగించినాడు.

వర్ణనా చమత్కారం :

సూర్యోదయ వర్ణన :

తృతీయాశ్వాసంలో శీలా కౌండిన్యుల వివాహానంతరము ప్రభాత వర్ణన చేయుచు కవి సూర్యోదయ వర్ణన గావించినాడు.

పద్మముఖులకు లసత్ప్రీతి యొసంగెడువాడు
కలువల ప్రభ సేలఁగలుపువాడు
చక్రవాకంబుల సరవిఁ బ్రోచెడి దొర
మదచకోరముపాలి మంట ప్రోవు
హరి సప్తకము పూన్చి నరదమెక్కెడు వాడు
మందేహ ముఖదైత్య మర్దనుండు
కుముద బాంధవ జోడు కమలనాథుని రూపు
పొంగఁదాల్చిన యట్టి దివ్యమూర్తి
జముని జనకుండు జారుల వైరిణులను
బొందనీకుండ గన్పెట్టు పూటకాపు
చిత్రభానుండు పూర్వాద్రి శిఖరిఁబొడమె
నరుణ కాంతులు జగమెల్ల నావహింప

పై పద్యంలో కవి సూర్యుని పట్ల ఉపయోగించిన విశేషణములు సార్థకములై భాసిల్లుచున్నవి. సూర్యుడు పూర్వాద్రి శిఖరముపై పొడముచు లోకమునకు ఎట్లు వెలుగులు పంచెనో, ఎట్లు అరదమెక్కెనో ఎవరిని సంహరించెనో, లోక బాంధవుడెట్లయ్యెనో, చెప్పి ఆ దివ్యమూర్తి పట్ల సార్థకమైన విశేషణముల నుపయోగించి తెలియ జెప్పినాడు.

శైత్యోపచార వర్ణన :

పంచమాశ్వాసమున భర్తృవిరహితమైన శీలకు నిజసఖులు శైత్యోపచారము లొనర్చినారు. ఇట్టిసమయమున కవి ముక్తపదగ్రస్తమును వాడి శబ్దాలంకార చమత్కారమును చూపినాడు.

సీ॥ పనివడి చెలులార! మనసిజు వేదన
తొలఁగంగ గంధంబు లందరమ్మ!
గంధంబు లలఁదిన గడుశైత్యమౌ తాళ
వృంతముల్గొని వేగ వీవరమ్మ!
వీచిన గాడ్పుచే వేవడ దాఁకును
జలువ పన్నీరు పైఁ జిలకరమ్మ!
పన్నీరు చిలికిన బరితాప మధికమౌ
కుసుమముల్ మేనున గుప్పరమ్మ!....

ఇత్యాదిగా గల పద్యాలలో స్నేహధర్మం వ్యక్తమౌతోంది. నిజమైన స్నేహితుడు సుఖాలలోనే కాదు కష్టాలలోకూడా స్నేహధర్మం పాటింపవలెనను నిదర్శనమే ఈవర్ణన. మానసిక క్లేశమును పోగొట్టకై శీల చెలులు నిజమైన చెలులై ఆమె వేదనను ఉపశమింప చేయుటకు శైత్యోపచారము లొనర్చిన విధము హృదయంగమముగా నున్నది.

మన స్తత్వ వర్ణన;

ప్రథమాశ్వాసమున ధర్మరాజు రాజసూయానంతరము, దుర్యోధనుని మనస్తాపమును వర్ణించుచూ అసూయాపరుడైన రాజు మనస్త్వమెట్టిదో వర్ణింపబడినది.

"చెలువు దరిగి భగిని నిలయంబు నందుండు
కంటె సత్త్రవారి యింట వనయ

ముందు కంటెసీవ ముత్కాటు చాజ్ఞాతి
యొప్పు చూచి చాలనోర్చియుంట ''

చెడి చెల్లింటికి, అలిగి అత్తింటికి నెళ్ళుట కదు నైచ్యమని ఉర్యులు చెప్పుదురు. కాని జ్ఞాతి వైభవమును చూచుచు జీవించుట పైరెండింటి కంటెను కూడా మిక్కిలి సంతాప కారకమని కవి స్పష్టపరచినాడు.

**సామాజిక స్థితిగతులు:**
**భోజన పంక్తులు:**

శీలా కౌండిన్యుల వివాహమైన తరువాత విందు భోజన సన్నివేశమును వర్ణించుచు సాంఘిక చారమునకు అద్దము పట్టినాడు కవి.

సీ॥ పరదేశులగు బీదబావల నొక పంక్తి
యువిదల బాలుర నొక్క పంక్తి
పౌర మహీసుర ప్రవరుల నొక పంక్తి
యొగి బంధు జనముల నొక్క పంక్తి
పటు దేవతార్చనా పరులను నొక పంక్తి
యుద్యోగవంతుల నొక్క పంక్తి
వియ్యాల వారల వేడ్కతో నొక పంక్తి
మిక్కిల వారల వేడ్కతో నొక పంక్తి

గీ॥ పంక్తు లీరీతి 'దరతమ భావమెప్పగ,
దీర్చియంత సుమంతుండు తీవ్ర మొగను
బంచ భక్ష్య పదార్థములు వమ్ముఖులc
దెచ్చి నండిలుచు,దని ప్రీతిc దెలుప వారు.

అనుటను బట్టి భక్ష, భోజ్య, లేహ్య, చోష్య, పానీయాది పదార్థములను వడ్డించుట, ఆనాటి భోజనములలో ప్రత్యేకత.

భోజన పంక్తులలో తరతమ భావాలతో హోదాల ననుసరించి ఆనాటిసమాజంలో భోజన నిర్వహణ ఎట్లు జరిపిరో, ఎట్లు కూర్చుండిరో వర్ణించి కవి అంటి సాంఘికా చారమునకు అద్దము పట్టినాడు.

**అత్తింట మెలగుట:**

సుమంతుడు తన కుమార్తెను అత్తవారింటికి పంపుచూ అత్తింట మెలగవలసిన రీతిని వివరించి నాడు.

అత్తమామల పట్ల నాదరంబుగవిని
భయ భక్తులను వారి పనులు చేయు...

అనుచూ అత్తమామల పట్ల ఆదరము, భయభక్తులు కలిగి ఉండాలంటూ బావమరుదులు, తోడికోడండ్రు చుట్టాలు మొదలగు వారలతో ఆదరాభిమానములు కలిగి యుండాలంటూ చెప్పబడింది. పుట్టినింటికి, అత్తింటికి కూడా మంచికీర్తి కలుగునట్లుగా ప్రవర్తించాలని చెప్పబడింది. హైందవ వివాహిత స్త్రీల ఆచార వ్యవహారాల పట్ల కవికి కల లోకజ్ఞత వ్యక్తమవుతోంది

**వైవాహిక సాంప్రదాయం:**

హిందూ సమాజంలో ఆనాడు పురుషసంతతి కంటె స్త్రీ సంతతి చాలా తక్కువగా ఉండేదేమో. అందుకే అట్టి సమాజంలో గుణవతియైన కన్యను కోరి అన్వేషణ ప్రారంభమయింది. గుణవతియైన కన్య వలననే వంశ ప్రతిష్ఠ ఇనుమడిస్తుందికదా!

కం॥ 'మున్నుగ గన్యారత్నం
బున్నయెడకు నరుగవచ్చు నుత్తమ మదిగా
కున్నను దమకుందామై
కన్నియనీయంగc జూట కార్యంబగునే'.

అనే పద్యంలో సుమంతుని మనోభావం వ్యక్తమౌతోంది. కౌండిన్యుని శిష్యులు కౌండిన్యునికి వివాహము కొరకు కన్యను వెదకుచు సుమంతుని ఆశ్రమం ప్రవేశించినారు. అట కౌండిన్యుని ఉత్తమ గుణములు చెప్పి ఆతనికై శీల''ను

యడిగారు. ఉత్తమ గుణములు గల వరునకు కన్యనిచ్చుటకు పితండ్రి సమ్మతింపడు" అదే అప్పట్టున జరిగినది. సుమంతుడు మహదానంద భరితుడై, 'కన్యాదాత తనకు తానుగా వరుని దగ్గరకు వెళ్ళి కన్యనిచ్చెదన'ని చెప్పుట సహజమైన కార్యము కాదని (చేయదగినది కాదని) చెప్పినాడు. ఆనాడు వివాహవిషయంలో గల సాంప్రదాయములు పై పద్యాన్ని బట్టి వ్యక్తమవుతున్నాయి.

**నుడికారములు—జాతీయములు-లోకోక్తులు ;**

ఒక జాతియొక్క జీవన విధానమును సూచించునట్టి రమణీయ వాక్యములనే 'నుడికారములు' అందురు. వీనినే జాతీయములు, లోకోక్తులు అని కూడా వ్యవహరించుచున్నారు.

ఒకటవ ఆశ్వాసమునందు దుర్యోధనుడు తన తండ్రితో ప్రసంగవశమున పునర్ద్యూతమునకు అనుమతించవలసినదిగా కోరిన సందర్భములో కవి పేర్కొన్న రచనయందలి లోకోక్తి కడు రమ్యమైయొప్పుచున్నది.

ఒకపరి పాండవులు జూదములో ఓడిన సిరిని, రాజ్యమును ధృతరాష్ట్రుడు తిరిగి వారికిచ్చివేసినాడు రానున్న కీడునూహించి ప్రతీకార దృష్టి లేకుండా చేయుటకై రాజ్యమిచ్చినాడు. క్షత్రియులు ప్రతీకారదృష్టి కలవారు కదా!

తల త్రొక్కిన త్రాచులవలె పాండవులు తమపై ప్రతీకారము తీర్చుకొందురేమో, అందరూ కాకపోయినను, ఏ ఒక్కడైననూ తమకు కీడు చేయుదురేమో అని శంకించిన దుర్యోధనుడు తండ్రితో పాండవులను విడుచుట, వారికి సిరికట్టబెట్టుట అనుచితమని తెల్పినాడు.

'ఉరగంబుల తలలు, త్రొక్కి విడిచినట్లయ్యె'...అని చెప్పుచు వారిని విడువరాదనియు అందులకై పునర్ద్యూతమునకు అనుమతింపవలసినదిగా కోరినాడు.

శ్రీకృష్ణుడు వనవాసము చేయుచు మిక్కిలి దుఃఖితులైన పాండవులను దర్శించినాడు, వారినోదార్చుచు ధర్మరాజుతో "విధిఁగడపంగనే ఘనుడు గలడు" అనినాడు, విధానానికి ఎంతటివారైననూ తలవంచవలసినదే అను విషయము ప్రకటిత మగుచున్నది:

బ్రహ్మనిర్ణయాన్ని తప్పించడం ఎవరితరమూ కాదనే విషయాన్నే సుమంతుని భార్య దీక్షాదేవి మరణ సమయమున కవి ఉదాహరించినాడు,

గాటంపు కలికముల్ కన్నులఁ బెట్టివే—
సరి చనె నొక వైద్య శాస్త్ర వేత్త
యుష్ణ మిచ్చుటకునై యొక భిషగ్వరుఁడు తాఁ
గడువేగఁ బొట్లాలఁగాచె మఱియు
జింతామణియు రస సిందూరములు లోని
కిచ్చి వేదన హెచ్చననేగె నొకఁడు
గరళ మాదియుఁ గాఁగ గరి నౌషధములెల్ల
నొసఁగి సిరాకుఁడై దొక్కఁ డరిగె
నిట్లు చెప్పక యవ్వైద్యు లిండ్లకేఁగఁ
గని సుమంతుడు నెమ్మది క్రాగుచుండఁ
బాసె ప్రాణంబు లాతన్వి బ్రహ్మఘటన
గడప నెవ్వరు తరము భూకాంత తిలక।

పై పద్యాన్ని బట్టి లోకంలో మానవ ప్రయత్నం కొంతవరకే ఫలించుననియు, ఆఘటనలను ఘటనా సమర్థతతో తనియుట ఎవ్వరికినీ సాధ్యము కాదని ఆమెకు వైద్యము చేసిన వైద్యవరుల చేతనే నిరూపితమగుచున్నది. కావున బ్రహ్మరాతతుడిచి మనుగట సాధించుట మానవున కసాధ్యము.

బలహీనులు బలవంతునితో వైరము పూనినచో బలము సాగక నడుమనే వైఫల్యము చెందును.

ఈ విషయమును కవి ప్రసిద్ధ లోకోక్తితో వివరించి నాడు.

సీ॥ 'చెలిమోవితో సాటి చేసుక వచ్చి బిం
బఫలంబు ప్రవియించి పడి యె ధరణిఁ

గీ॥ బలము చాలని వైర మిప్పగిదిఁబూన
గానలు సాగునె నడఁమనె క్రుంగి పోక

అనుచు శీల సౌందర్య వర్ణన చేయుచు తనకు గల లోకానుభవమును వెల్లడిచేసినాడు

## సాహిత్యంలో గ్రంథ స్థానం, పఠనావశ్యకత :

తెలుగు సాహిత్యంలో నన్నయ, తిక్కన, ఎఱ్ఱన పాల్కురికి సోమన, శ్రీనాధుడు, పోతన, నందితిమ్మన, మొదలగు అనేకమంది తెలుగు కవులు తమకావ్యాలలో వ్రతశబ్ద ప్రసక్తిని తెచ్చారు. కావున వ్రతాలు తెలుగువారికి అతిప్రాచీనమైనవని చెప్పవచ్చును.

వ్రత సాహిత్యం మానవ నియమిత జీవితానికి, ఆధ్యాత్మికపరాకాష్ఠకు నిదర్శనం, ఇది ఆచరణీయం, ఆచరణీయమైన సాహిత్య మెప్పుడూ పఠనీయం కూడా. వ్రతములు చేసినా, చేస్తూండగా చూచినా, వ్రతకథలు వినినా కూడా ముక్తి కలుగుతుందని మన గాథలు చాటి చెప్తున్నాయి. మానసిక ప్రశాంతత నియమిత జీవితం వలననే చేకూరుతుంది. అది ఆధ్యాత్మిక సాహిత్య పఠనం వలన దక్కుతుంది. కాబట్టి ఆధ్యాత్మిక చింతనాసక్తులు, సాహిత్య రసాస్వాదనా తత్పరులు అగు పాఠకులు ఈ ప్రబంధాన్ని పఠించడం అవసరం .

కవి శ్రీ తిరుమలరాయడు 73 శ్లోకాలుగా నున్న మూలకథను వన్నెలు చిన్నెలు కల్పించి 940 కి పైగా గద్య పద్యాలతో ప్రబంధంగా రూపకల్పన చేశాడు.

చిరకాలంగా మరుగున పడి తాళపత్ర రూపంలో ఉన్న ఈ ప్రబంధాన్ని సంగ్రహంగా పాఠకలోకానికి పరిచయం చేయాలన్నదే ప్రస్తుత వ్యాసంలో నా యీ ప్రయత్నం.

నా యీ ప్రయత్నంలో సహకరించిన మద్రాస్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధికారులకు కృతజ్ఞతలు.

# రాధికాసాంత్వనము–ఒక పరిశీలన

డా॥ చిత్రాజు గోవిందరాజు

ఆది తంజావూరు. 18వ శతాబ్దం. నాగవాసం. అవూళ్ళో ఓ పేరెన్నికగన్న వేశ్య. ఆమె పేరు తంజనాయకి. ఆమె వీణ అద్భుతంగా వాయించేది. లీవిగా నటించేది. కమ్మగా పాడేది. సమ్మోహనకరంగా సభల్లో మాట్లాడేది. ఎంతో మంది ప్రముఖులు ఆమె విందుకోసం అర్రులు చాచాను. ఆమెకు పిల్లలు లేరు. పిల్లలను పెంచుకోవాలనే కోరిక కలిగింది. ఆదేవూళ్ళోని 'అయ్యావయ్యా' అనే సామాన్యుని కొడుకును చేరదీసి పెంచి పెద్ద జేసింది. వాడిపేరు 'ముత్యాలు' ఇతనికి కలిగిన సంతానం ఏడుమంది. పెద్దది ముద్దుపళని' ఈమె కాలం క్రీ.శ 1740–1780.

ముత్యాలు సుబ్రహ్మణ్యస్వామి భక్తుడు. దక్షిణాదిలో 'పళని' ప్రసిద్ధ కుమారస్వామి ఆలయస్థానం ముత్యాలు ఆ పేరే కూతురికి పెట్టాడు పిల్లల పేరుముందు ముద్దు అనే ఆప్యాయసూచక పదం పెట్టడం దక్షిణాదిన సర్వసామాన్యం.

ముద్దుపళని వేశ్య అయినా విద్వత్కవయిత్రి పడుపు వృత్తి చేపట్టినా భగవత్కైంకర్యాన్ని, భాగవత కైంకర్యాన్ని సమానంగా చేపట్టిన భక్తురాలు సాని అయినా సంగీత సాహిత్య విశారద. వెలయాలయినా విద్వత్సమ్మానిత. తిరుమలతాతాచార్యుల వంశంలోని రామానుజాచార్యులవారు ముద్దుపళని గురువు. తాను కృతుల్ని రచించడమేగాక అంకితాలు కూడా పుచ్చుకొన్న ధన్య.

## సామాజిక భూమిక

దక్షిణాంధ్రయుగంలో తెలుగుసాహిత్యం తంజావూరు నాయికరాజుల పాలనలో బాగా వర్ధిల్లింది. వారిలో ప్రముఖుడు రఘునాథ నాయకుడు. ఇందిరామందిరాన్ని స్థాపించి 'అభినవభోజరాజు'గా కీర్తిగాంచాడు. నాయకరాజుల తర్వాత ఆ ప్రాంతాన్ని మహారాష్ట్ర ప్రభువులు పరిపాలించారు. వారు ఆంధ్రనాయకుల అడుగుజాడల్లో నడచి తెలుగు సాహిత్యాన్ని ఆదరించి ఆదరించారు. అనాడు గీతి సాహితీలతలు శోభిల్లాయి.

తంజావూరును పరిపాలించిన [illegible]సల వంశీయులైన మహారాష్ట్ర రాజులలో శాహజిరాజు కుమారుడు ప్రతాపసింహుడు. అతని ఆస్థాన విద్వాంసురాలు ముద్దుపళని. కవన జాతు లెరిగిన అజాణ. నవరసాభినయ చతుర. 'రాధికాసాంత్వన' మనే శృంగార కావ్యాన్ని రసికజన మనోరంజకంగా రచించింది. హరివాసరంలో శ్రీహరిని ప్రార్థిస్తూ నిదురపోయిన వేళ స్వామి ప్రత్యక్షమై–

తెలుగు లెక్చరర్, యస్.కె.యు.పి.జి. సెంటర్, కర్నూల్–518 001

"చిన్న కృష్ణుండనే, నాదు చిత్తమునకు
సమ్మతంబైన రాధికాస్వాంత్వనంబు
తగనొనర్పు మదీయాంకితముగ నీవు
లలితగుణపేటి శ్రీముద్దుపళనిబోటి"; అని

ఆదేశించడం వల్ల ముద్దుపళని రచన చేసినట్లు చెప్పింది.

## పూర్వగాథల్లో రాధ

ఒకసారి ఇంద్రాణి విష్ణులోకానికి వెళ్ళి శ్రీమహావిష్ణువును చూచి ప్రార్థించి "నీ తొడపై కూర్చోవాలని వుంది" అని కోరుతుంది. "నీవు భూలోకానికి వెళ్ళు నేను శ్రీకృష్ణుడినై జన్మించి నీకోరిక తీరుస్తాను" అని ఆయన అభయమిస్తాడు. శచీదేవియే రాధగా జన్మిస్తుంది.

రాధతో కృష్ణుడు వుండటంచూచి రుక్మిణి అలుగుతుంది. అది తెలుసుకొని రాధ కృష్ణుని విడిచిపెట్టి వెళ్ళిపోతుంది. శ్రీకృష్ణుడు ఆమెను అన్వేషిస్తూ వెళతాడు. ఒకచోట ఆమె తపస్సు చేసుకొంటూ కనిపిస్తుంది అమెను చూచి కృష్ణుడు తన చేతిలోవున్న కోలను మోకాళ్ళ వద్దా, చేతుల్ని నడుంపై పెట్టుకొని నిలుచుకొని వుంటాడు.

భాగవతాది పురాణాల్లోను రాధపాత్ర కనిపిస్తుంది. వృషభానునికి కళావతియందు పుట్టిన కూతురు రాధ. కృష్ణుని మేనత్త. కృష్ణుడు భూలోకంలో వున్నప్పుడు ఈమె "రాసమునుండి పుట్టి అతని ఎదుట పరిగెత్తింది". కావున ఆమెకురాధ అని పేరు వచ్చింది. కృష్ణుడు ఈమెను చూచి మోహిస్తాడు. రాధ శరీరంలోని రోమాలనుండి గోపికలు పుట్టారు. శ్రీకృష్ణుడు గోపికలతోగూడి వుండటం చూసి సహించలేక రాధ శ్రీకృష్ణుని నిందిస్తుంది. శ్రీకృష్ణుని పార్శ్వుడైన సుదాముడు "వాసుదేవుని ఎందుకిలా నిందిస్తున్నావు;" అని రాధను అడుగుతాడు. వానిపైన కోపం వచ్చి "నీవు రాక్షసుడుగా జన్మించు" అని రాధ శపిస్తుంది.

## రాధాకృష్ణుల ప్రణయం

రాధామాధవుల ప్రణయం అతి ప్రాచీనమైనది. స్త్రీ పురుష శృంగార సంబంధానికి ప్రతీకగా నిలిచింది. సంస్కృతంలో మహాకవి అయిన జయదేవుడు "మధుర కోమల కాంత పదావళి"తో ఆపాతమధురము, ఆలోచనామృతమైన 'గీతగోవింద' మనే శృంగార గేయ ప్రబంధాన్ని రచించాడు. ఇది "రాధాకృష్ణ ప్రణయలీల" శ్రీ వాసుదేవ రతికేళి కథ.

రాధాకృష్ణుల ప్రణయాన్ని చైతన్య మహాప్రభువు 'మధురభక్తిగ' రూపొందించాడు. దానిని చైతన్యమతీయులు ఆరాధించారు.

అన్ని భారతీయ సాహిత్యాలలో రాధాకృష్ణులను మించిన శృంగార నాయకా నాయకులు లేరనే చెప్పాలి. ఆదినుంచీకాక పోయినా తెలుగు సాహిత్యంలో కూడ రాధామాధవుల ప్రణయమే శృంగార కావ్యరచనకు ఆలంబనమైనది. పురాణ యుగంలో రాధ ప్రసక్తే మన గ్రంథాలలో కనబడదు. భీమఖండం అవతారికలో ఇష్టదేవతాస్తుతి చేస్తూ కవిసార్వభౌముడు మూడో పద్యం లోనే ధూర్తగోపాలుడు "పచ్చకప్పురపు బాసనాల తాంబూలపు మోవి రాధ మోవిపై మోపి నట్టు 'రచించాడు. రాధా మాధవుల చేత తొలి ముద్దు పెట్టించిన ఘనత శ్రీనాథునికే దక్కుతుంది ఆతరువాత చాలామంది ఈ శృంగారాన్ని యధా శక్తి విచ్చలవిడిగా కీర్తించారు. ఎన్నో రచనలు చేశారు. అయితే ఆ ప్రబంధాలలో విశేష ప్రచారం పొందిన కావ్యం మాత్రం ముద్దు పళని రాధికా స్వాంత్వనమే.

## తెలుగులో రాధ కథ

తెలుగులో వచ్చిన తొలి సాంత్వన కావ్యం లింగమఖి తిరుకామయ్య వ్రాసిన సత్యభామా సాంత్వనం. రాధా మాధవ శృంగారాన్ని శ్రీకృష్ణ దేవరాయల కాలంలోనే చింతలపూడి ఎల్లన రాసి రాధా మాధవ కవిగా పేరుతెచ్చుకున్నాడు. తరువాత ధరణీదేవుల రామయ్య దశావతార చరిత్రలో రాధ కథ చెప్పినా. అతని అడుగు జాడల్లో వెలిదండ్ల వేంకటపతి రాధా మాధవ సంవాదం రచించాడు.

చింతలపూడి ఎల్లన కావ్యంలో ఆమె స్వీయ. శ్రీకృష్ణుడు ఆమెను స్వయంవరంలో పెళ్ళాడతాడు. ధరణీ దేవుల రామయ్య రాధను నందుని ఇంట ఆడపడుచుగా సృష్టించాడు. దీన్ని వెలిదండ్ల వేంకటపతి ప్రచారం చేశాడు. రాధకు ఒక పెళ్ళి కూడ చేశాడు. వీళ్ళతోవలోనే ముద్దు పళని నడిచింది. శ్రీకృష్ణుణ్ని తెలుగు వాణ్ణి చెయ్యాలని ఏ కావ్యంలో కడబడని మేనరికం ఇప్పించబడె.

### కర్తృత్వ వివాదము

సాహిత్యలోకంలో- సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు 'రాధికా సాంత్వనము' అనే ఏకాశ్వాస ప్రబంధాన్ని రచించాడని దానిని విస్తరింపజేసి నాలుగు ఆశ్వాసాల ప్రబంధంగా ముద్దు పళని మలచిందని ఒక వాదం వినిపిస్తుంది. అయితే గ్రంథ చౌర్య కళంకాన్ని ఆపాదించే యీవాదం నేడు పరాస్తమై పోయింది. వేంకట కృష్ణప్ప కవిత్వం సంశయమైంది. సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్రగారు ఈకర్తృత్వ వివాదాన్ని తీర్మానిస్తూ- ''ముద్దు పళని ఆ-టే గిట్టని బాగూరు రంగశాయి కూతురైన అమ్మి అనే వారకాంతను సంతృప్తి పరచడం కోసం ఆమె విటుడైన వేంకటస్వామి నాయుడు అనే కవి ముద్దు పళని కావ్యానికే కూట సృష్టిగా ఆ ఏకాశ్వాస ప్రబంధాన్ని రచించి 'సముఖ' కవికి కర్తృత్వాన్ని అంటగట్టినట్టు పేర్కొన్నాడు.

### నామౌచిత్యం :

'సాంత్వనము' అంటే ఓదార్పు. ఈకావ్యంలో రాధాదేవి తన పెంపుడు కూతురైన ఇళాదేవిని శ్రీకృష్ణునికి యిచ్చి వివాహం చేస్తుంది. ఆ కృష్ణుడు ఆ చిన్నదాని మీద మోహంలోపడి రాధను కొన్నాళ్ళపాటు మరచి పోతాడు, చివరికి వివేకం కలిగి తిరిగి రాధను ఓదారుస్తాడు. అందుకే కావ్యం పేరు 'రాధికా సాంత్వనము' అయింది.

ఈ కావ్యంయొక్క మూలాన్ని గురించి సి.పి. బ్రౌన్ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చివున్నారు. అదేమంటే ప్రతాపసింహుడు మొదట నాగవాసం వేశ్య అయిన తంజినాయకిని వుంచుకొన్నాడు. చివరికి తిరిగి తల్లితో సమాధానం పరిచాడు. ఆ సాంత్వనాన్ని గురించి ఈ కావ్యం రచింపబడింది. ఈ కథ తంజావూరులో వినిపిస్తుంది.

### కథాకథనం

ఇది నాలుగు ఆశ్వాసాల గ్రంథం. 585 గద్యపద్యాలున్నాయి. అవతారిక—షష్ఠ్యంతాలతో సాంప్రదాయ ధోరణిలో రచనసాగింది. ఇందులోని కథ చాలాచిన్నది. 'రాధ అణగడం—ఇళ పెరగడం—అంతరంగం మరగడం—కృష్ణుడు రాగానే చెడామడా తెగడడం— చివరికి అతని కౌగిలిలో నలగడం' యీకావ్యంలోవి ముఖ్యమైన అంశాలు. అయితే ఈకథను శుకమహర్షిచేత జనక రాజర్షికి చెప్పించడమే ముద్దుపళని గడుసుదనం.

రాధ కృష్ణుని మేనత్త. ఇళ మేనమామ కూతురు. శ్రీకృష్ణునికి ఇళతో వివాహం జరుగుతుంది

రాధ చిన్ననాటినుండి శ్రీకృష్ణునికి శృంగార మర్మాలను నేర్పి అతని మీద వలపు కలిగి వుండేది. ఇళను చిన్నతనంనుండి ప్రేమతో పెంచి ఆమెను శ్రీకృష్ణునికి ఇచ్చి పెళ్ళిచేసి తన ప్రేమధనం కొల్లగొట్టబడిందని చాలా బాధపడుతుంది. కృష్ణుడు ఇళతో కూడి అత్తవారింటికి వెళతాడు. విరహం ఓర్వలేక రాధ తన పెంపుడు చిలుకను శ్రీకృష్ణుని దగ్గరకి రాయబారం పంపుతుంది. ఇళారాధలు మొదట సఖ్యంగా వుండి చివరికి విరోధులవుతారు. కృష్ణుడు ఇళపై మక్కువ చూపుతున్నాడని అతనిపై అలిగింది. కృష్ణుడుకూడ రాధను విడనాడినందుకు విరహబాధ అనుభవిస్తుంటాడు. చివరకు కృష్ణుడు ఆమె అలుకను తీర్చటానికి ఆమె కాళ్ళమీదపడి.... విరహాన్ని ఉపశమింపజేస్తాడు.

శ్రీకృష్ణుడు ఎందరో గోపికల్ని చూశాడు. కాని వాళ్ళంతా రాధ ముందు దిసికట్టే అని తెలుసు. అందుకే రాధ బాధపడుతుందని తెలిసి తాను బాధ పడ్డాడు. ఆమె మెడపట్టి గెంటినా చూరు పట్టుకొని వేలాడాడు. ఆమె బిగిసిన కొద్దీ ప్రాధేయపడ్డాడు. వచ్చిన కృష్ణుకు ఎక్కడికీ పోడని రాధకు తెలుసు. ఎంతకీ ఆమె కరగకపోతే ''ఇక వెళ్ళొస్తా సెలవు'' అన్నాడు. అప్పుడు రాధ చప్రున లేచింది. అప్పటి ఆంగిక విన్యాసాన్ని ముద్దుపళని వర్ణించిన తీరు చూడండి.

''అన గుబుసంబు నూడ్చిన మహాభుజగాంగన
నా ముసుంగు తె
ప్పున జెరవేసి ముడిబొమ్మ లెసంగ గటంబు
లుబ్బగా
గనుదీగ లెఱ్ఱవాఱ, ముఖకంజము జేవురు
దోప, జెమ్మటల్
కనబడగాని మోపదర గామిని పల్కె దురాప
కోపమై''

ముందుకు చొరకడం, దగ్గరలో కనిపించిన వస్తువుల్ని ఎదుటివారి మీదకు ఆగ్రహం అంచులు దాటినవేళ విసరివేయడం, అది వ్యర్థమయితే తామే ఆంగికంగా ఎదుర్కోవడం మొదలైనవి సహజమైనవే. ''మానం పోయాక ప్రాణమెందుకు? చస్తాను'' అంటుంది. అప్పుడు కృష్ణుకు ఆమె కాళ్ళమీద పడతాడు.

'సెలవు' అని కృష్ణుడు అనే దాకా రాధచేత మాట్లాడించక పోవడం, 'ఈ బ్రతుకెందుకు?' అని రాధ అనే దాకా కృష్ణుణ్ని కాళ్ళమీద పడనివ్వక పోవడం ముద్దుపళని కథా కథన నైపుణ్యాన్ని చాటుతున్నాయి.

## పాత్రచిత్రణ

ఈ కావ్యంలో గొప్ప కవిత్వ ధోరణులులేవు. విశేష చమత్కారాలు లేవు. ఉన్న గొప్పతనమంతా పాత్రోన్మీలనం. ముద్దుపళని పాత్రల స్వభావాలను ఎక్కడా వ్యాఖ్యానం చేయదు. వాళ్ళ మానసిక భావాలను సంభాషణల ద్వారా, స్వగతాలద్వారా బయటపెడుతుంది. మధ్యలో జొరబడి తాను కథనం చేయదు. ఈ కావ్యానికి 'ఇళా దేవీయం' అనే ఇంకో పేరు కూడ వుంది. అందుకే ఇళపాత్రను చక్కగా పోషించింది.

ఇక తన భావాలను బయట పడనీయదు. శోభనం నాడే రాధ మీద యీమెకు కోపం వచ్చింది. రాధా కృష్ణుల క్రీడానంతరం 'ఇళ కుటిలాలక తన కుటిలత్వ మెరుంగనీక' వాళ్ళ దగ్గరికి వచ్చిందని ముద్దుపళని చాలా ముక్తసరిగా ఒక్క మాటలో ఇళ అంతర్గత సంక్షోభాన్ని చూపించి ముగ్ధ అయిన ఆమె పట్టినింట వేవేల విధాల కృష్ణుని సుఖపెట్టి మెప్పించి రాధను పుగపింపజేసింది.

అయితే రాధ రాధే. మాధవుడు రాధను మరచి పోలేదు. అతని శృంగార రాసిక్యమంతా రాధనుంచి

నేర్చుకొన్నదే. రసికతలో గురువును మించిన శిష్యురాలైపోయాను కృష్ణుని దక్షిణ నాయకత్వాన్ని ముద్దుపళని ఎంతో చక్కగా చిత్రించింది.

## సఖీసాంత్వనం

సాటిస్త్రీలు పైగా సమాన వయోగుణ రూపవంతులైనవారు తమ చెలికి వచ్చిన కష్టాన్ని తలచుకొని బాధపడడం, బాధ నివారణకోసం ఉపచారాలు చేయడం, ఆమెకు నమ్మకం కలిగేటట్లు మాటలాడడం మొదలైనవి యీకోవలో చేరతాయి. ఈ సాంత్వనం రాధికాసాంత్వనంలో రసరమ్యంగా వర్ణితం.

శ్రీకృష్ణుడు ఇళా దాసుడయ్యాడని తెలియగనే రాధ మూగవోయింది. మనసు మనసులోలేక వెర్రి ఆలోచనలతో సతమతమవుతూ గతాన్ని తలచుకొంటూ కటవరపడసాగింది. రాధ చెలికత్తెలంతా ఏమీతోచనిస్థితిలో పడ్డారు. కడుపులోని శోకం కరిగిపోయేదాకా చెలికత్తెలూరకున్నారు. చివరకు—

"వనజాతవదన లదిగని
వనితామణి చుట్టుముట్టి వగవకు మమ్మా!
వనమాలి గూడె, దిదిగో
వినుమా!తక్షణపుగౌళి విశదంబయ్యెన్,
వనరగనేటికి? నేటికి
వనజాక్షుడు వచ్చువేళ వచ్చెనటంచున్"—

అంటూ ఓదార్చడంలో రాధ శోకాన పడ్డది.

ఇతర గ్రంథాలలోని చెలికత్తెల కంటే రాధ సాంత్వనంలోని చెలికత్తెలు భిన్నమయినవారు. 'ఉషాపరిణయం'లో ఉషకు నచ్చిన చెలికత్తె చిత్రలేఖ! 'మన్నారుదాస విలాసం' నాటకంలో కాంతిమతి మెచ్చిన చెలికత్తె విలాసవతి. కాని రాధికా సాంత్వనంలో రాధకు అందరూ మెచ్చిన, నచ్చిన చెలికత్తెలే. వారి మధ్య గుసగుసలకుగాని, పకపకలకుగానీ ఏమాత్రం అవకాశంలేదు. పడకటింటి రహస్యాలను కూడ బాహాటంగా చెప్పుకొని మురిసేటంత, బాధపడేటంత చనువు వారిమధ్య వుంది. ఆకారణంవల్లనే రాధ నిరాశకు గురై నిట్టూర్పులు వదిలేవేళ వనితామణిని చుట్టుముట్టి—

"ఏల యిక జాలి?వనమాలి నేలి మేలు
కొనెయ వినవమ్మ! శుభము చేకొనవమ్మ,'

అని ఆశ్వాసించారు.

## ఆక్షేపణలు—నిషేధాలు

కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ కావ్యంలో స్త్రీలు చదవదగని ఎన్నో అంశాలున్నాయని పేర్కొన్నారు. సహృదయులైన పురుషులు కూడ చదవడానికి అవి అసభ్యంగా వున్నాయని నాగరత్నంగారు అన్నారు.

1910 ప్రాంతంలో ప్రభుత్వంవారు ఈ కావ్యాన్ని నిషేధించారు. ఇరవైనాలుగు పద్యాలు అసభ్యంగా వున్నాయని కారణం తెలిపారు. స్వరాజ్యం వచ్చాక టంగుటూరి ప్రకాశంగారి ప్రభుత్వంలో ఈకావ్యంమీద నిషేధం తొలగింది.

ప్రథమాశ్వాసంలో పదిపద్యాలు ఒకప్పుడు ప్రభుత్వ నిషేధానికి గురిఅయ్యాయి. అందులో అరవయ్యారవ పద్యం కూడ ఒకటి. రాధ ఇళను సర్వాంగ సుందరంగా అలంకరించింది. పడకటింటి రహస్యాలను గుంభనంగా చెవిలో ఊదింది. 'మగవాని మెచ్చికోలు కనుగుణంగా మగువలు నడచుకొనే విధానాన్ని మరీమరీ చెప్పింది

"చెలువుండు కౌగిట జేర్చునో, యపుడీవు
గుబ్బల మెలమెల్ల గుమ్మవమ్మ,
విభుడు చెక్కిలి ముద్దు పెట్టుచో యపుడీవు
నలదు మోమొక్కింత యానవమ్మ"

అని ఉపదేశమిచ్చి కోతిగృహానికి పంపిందట

నాగరికత అంతగాలేని రోజుల్లో ఇంటా బయటా గుట్టుగా జీవితం వెళ్ళబుచ్చే కుటుంబాలలో పెద్దలు పిల్లలకు రహస్యంగా చెప్పే విధానమే రాధ పాత్రలో కనిపిస్తుంది అసభ్యత పేరిట సందర్భోచితమైన ఈ అంపక ఉపదేశాన్ని కావ్యంనుంచి తొలగించడం సత్సంప్రదాయంకాదు.

కొంతమంది ఇలాంటి కావ్యాల్లో అసభ్యత వుందని త్రోసిపుచ్చినా, అన్నికాలాల్లో అన్నిదేశాల్లో ఇలాంటి రచనలు ప్రజాభిమానాన్ని, ప్రాచుర్యాన్ని పొందుతూనే వున్నాయి ఎందుకంటే మనిషిలో తీరని కోరికలు పాత్రల మనోభావాలతో తాదాత్మ్యం చెందినపుడు రసానందం కలుగుతుంది.

భాష :

ప్రాచీన ఆంధ్ర రచయిత్రులలో ముద్దుపళని కావ్యభాషలోనే రచన సాగించింది. కావ్యభాష అనగానే జటిలమైన వ్యాకరణనియమాలు. సంక్లిష్టమైన ఛందోనియమాలు తప్పవు. ఈ అడ్డుగోడల్ని దాటుకొని సజీవమైన భాషలో వ్యక్తీకరించడం కత్తిమీద సాములాంటిది. అయినా సజీవ భావ ప్రకటన కోసం సామెతలు, లోకోక్తులు విరివిగావాడి కృతకృత్యురాలైంది. వీటి అన్నింటి భావానికి దగిన భాషావేగాన్ని పాటించింది.

కృష్ణుని దగ్గరికి రాయబారమంపిన చిలుక తాను చూసిన దృశ్యాలను, విన్న పాటల్ని 'చిలక పలుకులు'గా రాధ చెవిని పడవేసింది. అప్పటి రాధ ఆక్రోషం, ఆవేశం, బాధల్ని రంగరించి ముద్దుపళని వ్రాసిన పద్యం.

'ఏమేమీ? వెరపింత లేకయే యిలా హేమాంగి
యిట్లాడెనే
యామాట ల్విని మెంచిదనియెనే యాధూర్త
గోపాలుడున్
రామా? అట్లనెగాని మంచిదని రా రాపేల;
యేమాయె నా
భామారత్నము గూడా తాసుఖముమై వర్ధిల్ల
నంజాలదే'

ఆచార్య సర్వోత్తమరావు గారన్నట్లు—'మొన్న మొన్నటి దాకా సాగిన సాంఘిక వ్యవస్థలో మగవారి విలాసాలకు, డాబు దర్పాలకు బహుభార్యాత్వం కూడ ఒక సాక్ష్యం. ఈ కృత్రిమ సామాజిక గౌరవం కారణంగా కుటుంబంలో రగిలే అగ్ని గూడా లెన్నో ఈ పునాదుల ప్రాతిపదికగా సవతుల కయ్యాల కథలు వెలువడ్డాయి". ఈ దృష్టితోనే ముద్దు పళని 'రాధికా సాంత్వనం' వ్రాసి సఫలీకృత మనోరథురాలైంది.

# విశ్వసాహితిలో రుబాయి

...డా॥ సి. ఓబళేసు

ప్రపంచ వాఙ్మయమునందు పారశీక సాహిత్యానికి ఒక ప్రత్యేక స్థానం వుంది. పారశీక భాష మృదుమధుర శబ్ద సారస్యము కలిగి శ్రుతిహితంగా వుండే ప్రాచ్య భాషల్లో ఒకటి. ఛందస్సులోని వివిధ గతులవల్ల ప్రాసాంత్యాక్షర నియమం వల్ల పారశీక పద్యాలు గేయాలు చదివేటప్పుడు వినేటప్పుడు మనోహరంగా వుంటాయి ఆ భాషలోని కావ్య భేదాలు మన తెలుగు భాషా ఛందస్సులోని జాతులను, ఉపజాతులను పోలి వుంటాయి ఉదాహరణకు 'మున్నవి" అనే పారశీక ఛందస్సు మంజరీ ద్విపదకు సరిపోతుంది. రుబాయి కూడా పారశీక ఛందోభేదాల్లో ఒకటి పారశీక కవులు వ్రాసిన రుబాయిలను చాలామంది తెలుగు కవులు శైలీ భేదాలతో తెలుగులోనికి అనువదించారు. అట్లే కొందరు ఆంగ్లము, ఉర్దూ, ఫ్రెంచి మొదలగు భాషలలోనికి అనువదించారు విశ్వ సాహితీ రంగంలో రుబాయిని- రుబాయి కవులను, అనువాదకులను గురించి పరిశీలించడమే ప్రస్తుత వ్యాస ప్రధానోద్దేశం.

## రుబాయి స్వరూపం ;

'రుబా' అంటే నాలుగు. రుబాయి అంటే నాలుగు పాదాలు కలది. ఇది బ్రమాటే అయినా పార్శీలో బాగా వ్యాప్తి పొందింది. ఇది మన తేటగీతికి సరిపోల్తుంది. తేటగీతి వలె ఇది కూడా దేశీ ఛ్ఛందస్సని చెబుతారు. రుబాయిలో ఒకటి, రెండు, నాలుగవ పాదాలకు అంత్యనియమం వుంది వేమన గీతాలలో వలె 'రుబాయి' తత్త్వాలు, నీతులు సంక్షేపించి చెప్పటానికి అనువుగా వుంటుంది. ఖయ్యాము రుబాయతు, హఫీజు 'సాఖీనామా' ఈ తెగ కావ్యాల్లో గణుతికెక్కాయి. ఇది మాత్రా ఛందస్సుపై కలిగివుండి పాడడానికి అనుకూలంగా వుంటుంది రుబాయి 21 మాత్రల్ని మించి వుండదు. ఒక్క మాటలో చెప్పాలంటే గజల్ లోని రెండు షేర్లే రుబాయిలు:

## రుబాయి స్వభావం ;

స్వభావాన్ని వస్తు దృష్టితో చూడవచ్చు. రుబాయికి వస్తువిషయంతో ఏకత్వం లేదు. ఏ రుబాయికి ఆరుబాయే పరిమితం. సంప్రదాయక రుబాయిల్లో 'శృంగారం' ప్రధానంగా కన్పిస్తుంది. కాని నవీనమైన రుబాయిల్లో నైతిక సందేశం వినిపిస్తుంది. ఇంచుమించు సొంత రుబాయికవులు కూడా ఇలాగే చేశారు. రాను రాను చమత్కారం కూడా ముఖ్య భూమిక ధరించింది.

ఎస్.కె. యూనివర్శిటీ, స్టాఫ్ క్వార్టర్ సి-19 అనంతపురం-515 003.

## రుబాయి పూర్వ చరిత్ర

దీని పుట్టుకను గురించి 'దౌలత్ షాహ సమర్ఖండ్ ఇలా వ్రాశాడు—పారశీకంలో యాకూబ్ బిన్ లైస్ సఫా' అను పాదుషా వుండేవాడు. అతడు తన చిన్న కుమారుణ్ణి చాలా గారాబంగా పెంచుకుంటుండేవాడు. ఈద్ పండుగరోజు ఆ బాలుడు తోటి పిల్లలతో కలసి గింజలాట ఆడుతున్నాడు. వినోదాన్ని చూడటానికి తండ్రి కూడా అక్కడకు వచ్చి నిలబడ్డాడు. ఇతరవాళ్లలాగే రాజకుమారుడు కూడా గింజల్ని దొర్లించాడు. ఏడు గింజలు చెండును తగిలాయి. ఒకటి తప్పిపోయింది. అందు కాబాలుడు హతాశుడయి మరొకసారి గింజను దొర్లించగా అది చెండు దగ్గరకు దొర్లిపోయింది. సంతోషం పట్టలేక ఆ రాజకుమారు డిలా అన్నాడు— "ఘల్తాన్ ఘల్తాన్ హమీర్వద్ తాలబెగో" అనగా దొర్లుతూ ఆ గింజ చెండు అంచుకు పోతోందని అర్థం. పాదుషాకీ మాటలు వినసొంపుగా వున్నాయి. అంతట ఆయన తన వజీరుల్ని రప్పించి ఆ వాక్యాన్ని వినిపించాడు. అది కవిత్వమని వారు చెప్పారు. అట్టి పాదమే మరియొకటి వ్రాయబడినది. అది కొన్నాళ్ళ వరకు "ద్విపద" గానే వాడుకలో వుండేది. కాని భావాలిమడ్చటానికి రెండు పాదాలు చాలవని రెండు ద్విపదల నొకటిగా చేర్చారు. అదే 'రుబాయి' అయింది."

## పార్శీ రుబాయి కవులు :

1 ఖ: ఇతని పూర్తిపేరు 'గియాసుద్దీన్ అబుల్ఫ తహ్ ఉమబిన్ ఇబ్రహిమ్'. తఖల్లుస్ (కలం) పేరు ఖయ్యాము. అరబ్బీ పారశీక ఉర్దూ కవులు తమ పేర్లకు తండ్రులపేర్లు జోడించుకొనే సంప్రదాయముంది. అందువల్ల ఖయ్యాము తండ్రి పేరు ఇబ్రహీమని తెలిసికొన వీలైంది.

"జ్ఞాన పటాలయమ్ము నాడికమ్ముగ గుట్టు
ఖయాము వేడు దుఃఖానల దగ్ధుడయ్యె... ..

అని ఖయాము చెప్పుకొన్నాడు. గుడారాలు కుట్టి జీవించు పేదవాని కుమారుడు, ఆకాలంలో సుప్రసిద్ధ విశ్వవిద్యాలయంలో సర్వశాస్త్ర పారంగతుడయి ప్రాముషాతోను, నజీర్లతోను కలసి మెలసి ఆచార్య స్థాన మలంకరించడానికి తగినంత వీలుంటుందా అని మనకు సందేహం కలుగుతుంది. సాధారణంగా పూర్వకవుల చరిత్రలవలె ఖయ్యామ్ చరిత్రకూడా కాలగర్భంలో దాగివుంది. 'నిజాముల్ ముల్క్' వంటి సమకాలికులు, 'నిజామి ఉరూజీ' వంటి శిష్యులు 'దౌలత్ షాహ సమర్ఖండ్ వంటి తరువాతి గ్రంథరచయితలును వ్రాసిన వ్రాతల వల్ల ఖయామ్ జీవితంలోని కొన్ని అంశాలు మాత్రం మనకు తెలుసుకోవడానికి సాధ్యమౌతుంది.

ఉమర్ ఖయ్యాం అపూర్వ జ్ఞాపక శక్తి కలవాడు. వందల కొద్దీ తన రుబాయీల సంపుటి బండి ప్రయాణంలో పడిపోగా తిరిగి వాటన్నిటిని చెప్పగలిగాడు. అవే నేటిదాకా నిలిచిన ఆణిముత్యాలు. నిజాముల్ ముల్క్ వ్రాతను బట్టి — ఖయ్యాము ఉద్యోగాపేక్ష లేని వాడని విజ్ఞాన సంపాదనమందే నిమగ్నుడయి 'అల్ప్ అర్స్లాన్' ప్రభువు చేత నిషాపూరున జాగీరును పొంది ప్రశాంతంగా కాలం గడుపుతుండేవాడని తెలుస్తుంది.

నిజాముల్ ముల్క్ ప్రసాదించిన జాగీరుల వల్లను, మలిక్ షా ఆదరణము వల్లను ఖయ్యాము మధ్యవయస్సు సుఖంగా గడిచింది. రాజాస్థానమందు పండిత గోష్ఠులందు సరస సల్లాపము లాడుతూ, శిష్యులకు పాఠాలు చెబుతూ, ప్రకృతి రామణీయకాన్ని తనివితీరా త్రాగుతూ, ఇష్టమున్నపుడు ఒక్కొక్క రుబాయి శిష్యుల యెదుట ఆశువుగ

చెబుతూ, 'సాకీ' అందించే ద్రాక్షాసవం ఆస్వాదిస్తూ, వల్లికబయళ్ళలో విహరిస్తూ, సెలయేటి పాటల్ని ఆలకిస్తూ, వనభోజనాలారగిస్తూ, వెన్నెల గోష్ఠులు సలుపుతూ ఖయ్యాము నిర్విచారంగా—శాంతంగా జీవితాన్ని గడిపాడు.

'భోగముల ననుభవింపుము. మధుపానము. గతము గతించె; భవిష్యదర్థము సంశయాంధ సంవృతము; వర్తమానమొక్కటె అనుభావ్యము. జీవితము వాతూలములోని దివ్వె; ప్రాయము ప్రతిక్షణము గతించిపోతున్నది. రాలినపూలు మరలా వికసింపవు త్వరపడుము' అనే భావాలు కల రుబాయీలు ఖయ్యాము మధ్యవయస్సున, అంతకు ముందున వ్రాయబడ్డాయని మనమూహింప వచ్చు.

ఖయ్యాము ఒక్క పద్యంకూడా వ్రాయకున్నా, అతని కీర్తి విజ్ఞానప్రపంచంలో శాశ్వతంగా ఉండ దగ్గదైనా, నేడు అతని కీర్తి అంతా రుబాయీపై ఆధారపడి వుంది. పురాతన పాంథశాలగు ఈ ప్రపంచంలో బహరాం, జమిషీడుల వంటి పాదుషాలెందరో కొన్ని యేండ్లు కాలాని గతించారు. రాజ్యాల హద్దులు మారిపోయాయి. ప్రపంచ స్వరూపమే మారింది అలాగయినా కూడ 'కవితాను ప్రాణితమైన' ఖయ్యాము యశశ్చంద్రికలు నేడు నా దేశాలందు వ్యాపించి హృదయాహ్లాదకరంగా విలసిల్లుతున్నాయి.

'థామస్ హార్డీ' అనే ప్రఖ్యాత ఆంగ్లరచయిత తన ఎనభైయెనిమిదవ యేట మృత్యుశయ్య మీద— కోరికగా ఉమర్ ఖయ్యాం రుబాయతులలో ఒక దాన్ని చదవమని కొడుకుని కోరాడట. కోరిక తీరాక మరణించాడు.

2 సర్మద్; ఇతడు అచ్చమైన సూఫీకవి. సర్మద్ మొదట యూదు మతస్థుడని తెలియ వస్తుందా బహుశా మత యుద్ధాల ధాటికి తాళలేక భారత దేశానికి వలస వచ్చి వుండవచ్చు. చరిత్రలో ఇతడు ఆలంఘీర్ ఆస్థాన కవిగా ప్రసిద్ధికెక్కాడు. బహుశః మత పరమైన వివాదాల వల్లనో, మరే కారణంగానో సర్మద్ ఆలంఘీర్ చేత ఉరితీయ బడ్డాడు.

సూఫీ సన్యాసుల వింత చేష్టలు, సామాజిక విషయాలు, అధికంగా ఆధ్యాత్మిక విషయాలు, సర్మద్ రుబాయీలలో చోటచేసుకున్నాయి.

3 మౌలానా రూమీ: ఈతడు పార్శీ భాషలో ఉత్తమశ్రేణికి చెందిన రచయిత. సూఫీ తత్త్వ ప్రతిపాదకములైన 30 000 మస్నవీ (ద్విపద) ఉను 13వ శతాబ్దంలో రచించాడు. అతని పూర్తి పేరు జలాలుద్దీన్. ఆతడు 'బల్ఖ' నివాసి కొన్ని కారణాలవల్ల ఆసియా మైనరులోని రూమ్‌కు తరలి పోవడం జరిగింది. అతని తండ్రి ఆనాటి ప్రఖ్యాత వేదాంతాచార్యుడు తండ్రి మరణానంతరం అతని స్థానంలో మౌలానా ఆచార్యుడై అనేకులకు విద్యాదానం చేశాడు. అతని విద్వత్తు, అతని కవిత, అతని శాస్త్ర పరిచితి, అతనికి ప్రశంసల నార్జించి పెట్టాయి. ఆనాటి పాదుషాలంతా అతణ్ణి సత్కరించారు

నిజాని కతను మస్నవీ కవి. అయినా పార్సీలో ప్రచారంగా వుండే రుబాయి పట్ల ఆకర్షితుడై రుబాయిలను సూఫీ దృక్పథంలో వ్రాసినట్లు తెలుస్తుంది.

4. అమ్జాద్ : ఇతడు కూడా సూఫీ కవి. సూఫీతత్త్వం ఇతని కవిత్వంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఆ పంథాలోనే ఆయన రుబాయీల రచన సాగింది. 'అమ్జాద్' హైదరాబాదులో

జీవించి వున్నారు. దాశరథి రచించిన రుబాయీలకు పరోక్ష ప్రేరేపకుడు 'అమ్జాద్ హైదరాబాదీ' అని తెలుస్తోంది. అందుచేతనే దాశరథి రచించిన రుబాయిలలో అమ్జాద్ ప్రభావం అధికంగా వున్నట్లు అతడే చెప్పాడు.

### రుబాయీ వ్యాప్తి

ఆంగ్లము 1. ఇ.బి. కోవెల్ : కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చరిత్రాధ్యాపకుడుగా వుండిన 'కోవెల్' బోడ్లియన్ లైబ్రరీలో ఖయ్యాము రుబాయతు వుందని 1856 లో కనుగొన్నాడు. దానిని గురించి 1858 లో 'కలకత్తా రెవ్యూ' నందు ఒక వ్యాసాన్ని ప్రకటించాడు.

2, ఎడ్వర్డు ఫిట్ జెరాల్డు :

ఇ.బి కోవెల్ తరువాత ఒక సంవత్సరానికి ఇతడు బోడ్లియన్ లైబ్రరీలోని రుబాయతును 75 పద్యాలుగా ఇంగ్లీషులోనికి తర్జుమా చేశాడు. తరువాత మరొక సంవత్సరానికి ఇంకా కొన్ని రుబాయీలను ఆంగ్లీకరించి నూటొక్క పద్యాలుగల ద్వితీయ సంస్కరణాన్ని ప్రకటించాడు. ఆమెరికన్లకా గ్రంథం మిక్కిలి ఆరాధ్యనీయమైంది.

ఫిట్ జెరాల్డు తర్జుమా ప్రజాదరణ పొంది మరి లక్షలకొలది పుస్తకాలు వెలవోవుచుండుట వల్ల మరికొందరు ఆంగ్లేయులు రుబాయతును ఆంగ్లీకరించిరి. కాని నైపుణ్యమందు, కవితా మాధుర్యమందు అవి ఫిట్ జెరాల్డ్ తర్జుమాకు సరిరావు. అతని కృతి మక్కికి మక్కి అనువాదము కాక మాతృక యందలి రమణీయములు, సున్నితములు అయిన భావాలను స్వతంత్రంగా సృజించిన మనోహర పద్యకావ్యం. కాబట్టే ఆ పద్యాల్లో చాల వరకు మాతృకలలో ఏ రుబాయికి యే పద్యం వ్రాయబడిందో తెలిసికోవడానికి వీలులేక కొన్ని రుబాయీలలోని భావాలను ఏరి కూర్చి ఒక పద్యంగా వ్రాశాడని ఫిట్ జెరాల్డు తెలిపాడు.

ఫ్రెంచి :

1867లో పారశీక రాజాస్థానంలో ఫ్రెంచి రాయబారికి ద్విభాషిగా వుండిన జె.బి. 'నికోల' రుబాయతును ఫ్రెంచి భాషలోనికి తర్జుమా చేశాడు. ఇతడు కూడ రుబాయీలను భావానువాదమే కాని యథాతథంగా అనువదించలేదు.

హిందీ;

బచ్చన్, రఘువంశలాల్ గుప్తలు హిందీలో ఖయ్యాం రుబాయీలను తర్జుమా చేసినట్లుతెలుస్తోంది హిందీలో 'చౌపాయి' పేరుతో చేసిన రుబాయీలు వున్నాయి. ఆనాడే 'రామచరిత మానస్' లో శ్రీగోస్వామి తులసీదాసు 'హనుమాన్ చాలీసా'ను స్వచ్ఛమైన చౌపాయీలలో వ్రాశాడు. చౌపాయి అనగా నాలుగు పాదాలు. రుబాయికి ఇది అత్యంత సన్నిహితమైన ఛందో విశేషం.

బెంగాలీ:

కాంతి చంద్రఘోష్ ఖయ్యాం రుబాయిలను వంగ భాషలోనికి అనువదించారు.

సంస్కృతం:

సంస్కృతంలో ఉత్పల, చంపక, మత్తేభ శార్దూల, స్రగ్ధర, మహాస్రగ్ధర, పంచచామర, మత్తకోకిల,తరళాది నాల్గుపాదాలుండే ప్రతివృత్తం కూడా రుబాయికి పరోక్షంగా స్ఫూర్తికాలే. కాని రుబాయి కుండే అంత్యనియమాలు ఈ వృత్తాలకుండనక్కరలేదు. ఏమైనప్పటికీ పాదస్వరూపం

వరకు వృత్తం రుబాయీలకు పరోక్ష స్ఫూర్తిగా అనడంలో సందేహం లేదు చతుష్పదులు కూడా ఇంతే

### ఉర్దూ

ఉర్దూ కవుల గజళ్ళలోని ప్రతి రెండు షేర్లు అచ్చంగా ఒక రుబాయీని పోలి వుంటాయి. కాని ఉర్దూ కవులు గజళ్ళను వ్రాసినంత విరివిగా రుబాయీలను వ్రాయలేదు. ఎందుకంటే అది వాళ్ళ ప్రక్రియ కాదు. అయినప్పటికీ ఆధునికుల్లో కొందరు సకృత్తుగా రుబాయి ప్రక్రియను స్పృశించారు. వారిలో 'జోష్ మలీహాబాదీ' మురాదాబాదీ'లు ముఖ్యులు. జోష్ కవిది లక్నో ప్రాంతం. స్వయంగా వీరు రుబాయీలను రచించారే తప్ప అనువాదం చేసిందేమీ లేదు. కాని 'శేషేంద్ర' లాంటి కవులు జోష్ రుబాయీలను వచన రూపంగా అక్కడక్కడ తర్జుమా చేశారు.

### తెలుగు 1 సదాశివ:

ఈయన 'సర్మద్' మూల రుబాయీలను కూలంకషంగా పరిశీలించి తెలుగులో, మూలంలోని మార్మికత చెడకుండ అనువదించారు. క్లుప్తత కోసం ఎక్కువగా ఆటవెలది, తేటగీతులను రచించారు. ఈయనది సరళ సుందరమైన శైలి. ఈయన తెనిగించిన అమ్జద్ రుబాయీలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వక్షాన ప్రకటించడమైనది. ఇతడు సూఫీతత్వం గురించి అమ్జద్ రుబాయీ అనువాదంలో విపులంగా చర్చించాడు సూఫీయోగుల రచనల్లో ద్వైతాన్ని నిరాకరించి 'అద్వైతాన్ని' ప్రతిపాదించిన సందర్భాలు కొన్ని వున్నట్లు ఇందులో తెలిపాడు.

### 2 దువ్వూరి రామిరెడ్డి :

దువ్వూరి వారితోనే 'రుబాయి' తెలుగులోనికి ప్రవేశించింది. తెలుగులో బహుళ ప్రచారంలోనికి వచ్చిన రుబాయీ అనువాదగ్రంథం ఒక్క 'పానశాల' మాత్రమే. పానశాలను పార్శీ ఉర్దూలలు మైఖానా అంటారు. పాంథశాలనే కావ్యనామంగా తెలిపాడు. ఈ పేరులోనే ఎంతో చైతన్యం కనిపిస్తుంది. అలసి వచ్చిన బాటసారికి 'హుషారు' గొలిపేదే మధుమందిరం. జీవన ప్రయాణంలో విసిగి వేసారిన వారందరికీ పానశాల అవశ్య పఠనీయం.

పానశాల తర్జుమా అంత సులభమేమీ కాదు. ఖయ్యాం వాలాలు చాలవరకు ప్రతీకాత్మకంగా వుంటాయి. రుబాయి రచన పార్శీలో సాధ్యమైనంతగా తెలుగులో సాధ్యంకాదు. ఒక కవి రుబాయి అనువాదం చెయ్యాలంటే తదనుగుణమైన స్వభావం కూడా అతని కుండాలి. అప్పుడప్పుడే దువ్వూరికి భార్యావియోగం కూడా కలిగింది. పగలు నిదురించి రాత్రి మేల్కొని భార్యా వియోగ దుఃఖ ప్రేరణతో దువ్వూరి-ఖయ్యాం రుబాయీలను తర్జుమా చేశాడు. బాహ్యంగా శృంగారాన్నే చెప్పినా నిగూఢంగా వేదన కూడా వుండాలి. ఖయ్యాం రుబాయీలలో కూడా అంతర్లీనంగా 'వేద'న దాగి వుంది. దువ్వూరి వేదనకు, ఖయ్యాం వేదన కూడా దగ్గరైంది. అందు చేతనే దువ్వూరి తన్మయభావితుడై దుఃఖ పూర్వకంగా విజృంభించి రుబాయీలను అనువదించాడు. భార్యావియోగ సంఘటనే జరగక పోయి వుంటే రుబాయి అనువాదాలు అంత పటిష్ఠంగా వుండేవి కావని ఆయనే చెప్పాడు.

దువ్వూరి కూడా ఖయ్యాం రుబాయీల నన్నింటిని తర్జమా చేయలేదు. ఎందుకంటే ఖయ్యాం

రుబాయీలలో ధ్వని ఎక్కువ. పార్శీలో ధ్వనిని 'అహంగ్' అంటారు. దాన్ని తెలుగులోనికి ఆవిష్కరించడం అత్యంత కష్టం, అలాంటి రుబాయీలు కొన్నింటిని దువ్వూరి పరిహరించాడు. ఆంధ్ర పాఠకలోకం అర్థం చేసుకునేంత వరకు మాత్రం దువ్వూరి ఖయాం రుబాయీలను అనువదించాడు.

దువ్వూరి ఖయాం రుబాయీలను వృత్తాలలో తెనిగించాడు. అక్కడక్కడ తేటగీతులను వ్రాశాడు. దువ్వూరి అనువాదం సరళ సుందరమైనది. ఎక్కడో కాని అర్థ క్లిష్టత లేనిది. అన్వయ కాఠిన్యం కూడా లేనిది. గులాబీ దళాల్లో మధువు నిక్షిప్తమై వున్నట్లు దువ్వూరి–పద్యంలో, ఖయ్యాము ఉద్దేశాలన్నీ నిక్షేపించడానికి ప్రతి పద్యమూ నిదర్శనమే. అక్కడక్కడ పాదుషాల పేర్లు, చెట్ల పేర్లు, 'కౌసర్' లాంటి స్వర్గనదుల పేర్లు అలాగే అనువదించి పార్శీ వాతావరణాన్ని చక్కగా ఆవిష్కరించాడు. ఈ నాటికీ తెలుగులో ఖయ్యాము రుబాయీలను అనువాదం చేసిన వారెందరో వున్నారు కాని వారంతా దువ్వూరికి సాటిరారు. వాళ్ళ అనువాదాలు కూడా దీపం ముందు మిణుగురు లాంటివే.

దువ్వూరి పానశాల రుబాయీలకు నకలు కాదు. ఖయ్యాం రచన తేనెతుట్టె వంటిదైతే రామిరెడ్డి రచన తుట్టెను పిండి నింపిన తేనెగిన్నె వంటిదని చెప్పవచ్చు. ఖయ్యాం రుబాయీలలో–అప్పుడపుడొకటి వ్రాయడంవల్ల పునరుక్తులు ఎక్కువగా వున్నాయి, దువ్వూరి ఆ పునరుక్తులను తొలగించారు. అంతే కాక నాలుగైదు రుబాయీలలో విపులంగా వదులుగా వున్న భావాన్ని ఒక్క పద్యంలో కుదించి శోభను కూర్చారు. ఖయ్యాము రచనలో లేని సొగసుదనాన్ని జతచేర్చి దేశీయ మనిపించేటంత స్వతంత్రంగా అనువదించాడు. అందుచేతనే యావదాంధ్రలోకము దువ్వూరిని అభినందించింది.

3. ఉమర్ ఆలీషా :

ఇతడు పిఠాపుర కవి ఖయ్యాం రుబాయీలను పద్యాల్లో అనువదించాడు కాని అవేమంత సొంపుగా లేవు. జన్మతః ఆతడు మహమ్మదీయుడైనప్పటికీ తెలుగు భాష మీద అల్పమైన అధికారం కలవాడు కనుక రుబాయి తర్జుమాకు తగ్గ శబ్దార్థపుష్టికి నోచుకోలేదు. అయినప్పటికి ఖయాం రుబాయీల చేత ఇతడు కూడా గొప్పగా ప్రేరేరింపబడినాడనడానికి సందేహం లేదు.

4. మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి. ఇతడు కూడా కోస్తా ప్రాంతీయుడే, రుబాయిలన్నిటిని అనువదించలేదు. కాని తన మనస్తత్త్వానికి అనుగుణంగా వుండే రుబాయీలను మాత్రం అనువదించినాడు రుబాయీలలో శృంగారం చోటు చేసుకున్నందువల్ల బహుశా అనువాదానికి సిద్ధపడి వుండవచ్చు. సుందర్రామ శాస్త్రి అనువాద పద్యాల్లో ఖయ్యాం లాగానే జీవుని తపన ఒకటి కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంది. డిగ్రీ తరగతికి పాఠ్యాంశాలుగా కూడా ఈ అనువాద పద్యాలు కొంతకాలం నిర్ణయింప బడ్డాయి: శాస్త్రిగారి రచన దువ్వూరి అంతటిది కాకపోయినా శబ్దార్థ సారళ్యం కలదని చెప్పవచ్చు

5 రాయప్రోలు సుబ్బారావు: మధుకలశం పేరుతో సుబ్బారావు రుబాయీలను అనువదించాడు పార్శీలో మధుకలశాన్ని 'మీనా' అంటారు. రావు గారు అంతగా పార్శీ మనస్తత్త్వం కలిగి వున్నవాడు కాదు. దువ్వూరి అనువాదాన్ని చూచిన తరువాత తత్ప్రేరేపితుడై వృత్తాల్లో రుబాయీలను అనువదించే ప్రయత్నం చేశాడు. అవి సంస్కృత తెలుగు వాతావరణాన్ని ఆవిష్కరిస్తున్నాయే తప్ప పార్శీ వాతావరణాన్ని కట్టి ఇవ్వలేవు. ఏమైనప్పటికీ ఖయ్యాం రుబాయీలలోని భావన అభిజ్ఞ

అనువాదకునిగా మర్చగలిగింది. ఇదంతా రుబాయీకి గల శక్తిని సూచిస్తుంది

6. గుడిపాటి వెంకట చలం: ఉమర్ ఖయ్యాం రుబాయీల సారాంశాన్ని వచనంగా మాత్రమే చలం గ్రహించాడు. అందరూ ఛందస్సులో అనువదిస్తే, ఇతడు వచనాలలో అనువదించినా ఏ రుబాయీకి ఆ వచనం కాకుండ రుబాయి భావాన్ని బట్టి మాత్రమే వచన రచన చేశాడు. అందుచేత చలంను 'భావానువాదకుడు' అనాల్సిందే. చిత్రమేమంటే ఆలీషా, శాస్త్రి, సుబ్బారావులు పద్యాల్లో వ్రాసినా చలం సాధించిన స్పందన కనిపించదు చలం తన మిత్రుని అభిలాష తీర్చడానికి రుబాయీలను తెనిగించాడు.

7 తెన్నేటి హేమలత: తన నవల్లో ఉమర్ ఖయ్యాం భావాలను, పార్శీ వాతావరణాన్ని, నవాబుల వైభవాన్ని వర్ణించింది. కాని ఖయ్యాం రుబాయీల ప్రభావం ఆమె భావాల మీద పరోక్షంగా చూపించిందని విశద మౌతుంది.

8. ముద్దుకృష్ణ ఇతను మరొక పద్యకవి. 'ఉమర్ ఖయ్యాం' పేరుతోనే ఆటవెలది, తేటగీతి పద్యాల్లో రుబాయిల అనువాదం చేశాడు. కాని ఆ పద్యాలు ఏమంత వేగం కలవి కావు. ఖయ్యాం భావాలకు ఆ పద్యానువాదం అంతగా సరిపడేది కాదు.

9. జంధ్యాల పాపయ్యశాస్త్రి :

ఈ కవి 'అమర్ ఖయ్యాం' పేరుతో ధారావాహికంగా సుమారు వందల పద్యాలదాకా రుబాయీలను బోలిన పద్యాలు ప్రచురిస్తూ వచ్చాడు. అవి అనువాద పద్యాలేమీ కాదు కాని ఖయ్యాం రుబాయీల సారాంశమంతా మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఇతరేతరులు అనువాదాలు చేసినా అంత అనుభూతి కలుగదు. జంధ్యాల రుబాయీల సారాంశాన్ని చెప్పినా చక్కని ఆనందానుభూతి కలుగుతుంది. ఒకనాటి ఉమర్ ఖయ్యాం ఈనాటిదాకా ఇంకా ఏనాటి దాకా అయినా అమర్ (శాశ్వతుడు) అయిపోతాడని ఈ శీర్షిక నామంలో వుండే ఉద్దేశ్యం.

10. దాశరథి:

'సాకీనామా' పేరుతో ఇతడు సొంత రుబాయీ ఛందస్సును కూడా పాటించాడు. పద్యాలేవీ కావు. అమ్జాద్ వద్ద రుబాయీ శిక్షణ పొంది దాని స్వరూప స్వభావాల్ని జీర్ణించుకొని తెలుగులో స్వతహాగా రుబాయీ రచన చేసిన దమన్న గౌరవం మొట్టమొదట దాశరథికే దక్కింది. ఫ్రెంచి స్పానిష్ భాషల్లో కూడా ఈ రుబాయి ప్రక్రియను గొప్పగా అధ్యయనం చేసినకవి దాశరథి. తెలుగువారికి దువ్వూరి తరువాత రుబాయి నాడీ మండలాన్ని ప్రదర్శించగలిగింది కూడా దాశరథే. ఇతని అనువాదం వ్యావహారిక శైలిలో సాగింది. ఒక్కొక్క తెలుగు రుబాయి ఒక్కొక్క జబ్బ చరుపులాగా వుంటుంది. నైతిక సందేశానికి తన రచనలో కొంతవరకు తావిచ్చింది దాశరథే.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య:

దాశరథికి పరోక్ష శిష్యుడు. తెలుగు రుబాయిలు అనే పేరుతో రుబాయీలను తెలుగులో రచించాడు. రుబాయి విశేషాలన్ని అతడు దాశరథి దగ్గరనే నేర్చుకున్నట్లు చెప్పాడు. చాలవరకు శ్రీనివాసాచార్య కూడా రుబాయీలలో శృంగారానికి చోటిచ్చాడు. అక్కడక్కడ సాంఘిక విషయాలకు, జాతీయ విషయాలకు చోటిచ్చాడు. ఇతని రుబాయీలలో స్పష్టత వుంది. స్పందన వుంది. అలంకారం వుంది.

ధ్వని వుంది. అన్నిటికిమించి ఎచ్చమైన 'కవి' వుంది

12. డా|| సి నారాయణరెడ్డి:

'ప్రపంచ' పదులు పేరుతో రుబాయీలను వారపత్రికలో ధారావాహికంగా ప్రచురించాడు. నాలుగేసి పాదాలు ప్రపంచ పదుల్లో వుండాల కాని ఐదేసి పాదాలు వుండటం వల్ల వీనిని రుబాయిలన లేము. కాని భావగతంగా ప్రపంచ 'పదులలో రుబాయీ ప్రభావంవుంది. అంత్యనియమాలే అందుకు కారణం నైతిక సందేశం మరొకకారణం; అంతేకాని రుబాయీ వాతావరణం ఇతని పదులలో కానరాదు.

ఆదిభట నారాయణదాసు :

ఖయామ్ రుబాయీలను ఉమర్–ఆలీషా, బుచ్చి సుందరరామశాస్త్రి లాంటి కవులు తర్జుమా చేసినట్లే సుప్రసిద హరికథకుడు, కవి శ్రీ దాసు కూడా అనువాదం చేశాడు. ఆయన ప్రధానంగా దువ్వూరి మొదలగు వారి అనువాదాలు చదివాక వాటి ద్వారా ప్రేరేపితుడై రచించాడు. పారశీ వాతావరణం ఆయన రచనలో అంతగా ప్రతిబింబింపబడలేదు. కాబట్టి ఆది అంత ప్రసిద్ధికి నోచుకోలేదు. ఏమైన ప్పటికి రుబాయికి ప్రతి రూపమనదగిన వృత్తాల్లో వ్రాయడం అభినందనీయం.

ఇంకా ఖయ్యాం రుబాయీలను తెలుగులో రామచంద్ర అప్పారావు 'అమరకావ్యం' పేరుతో, రంగయ్యప్పారావు–"ఉమర్ ఖయ్యాం రుబాయీలు' పేరుతో మడిపదగ బలరామాచార్య–'ఉమరు ఖయ్యాం–అమరగీతాలు' పేరుతో, స్వారి శ్రీ–'మధుపాత్రిక' పేరుతో, చిలుకూరి నారాయణరావు 'ఉమర్ఖయ్యాం శీర్షికతో, అద్దేపల్లి రామమోహన రావు 'మధుజ్వాల' పేరుతో తెనిగించారు. వీరు కాక ఇంకా పల్లప హనుమయ్య, శ్రీదేవి, బూర్గుల రామకృష్ణారావు, శ్రీరామశర్మ, కాటూరి గోపాలరావు, స్వామి శివశంకరశాస్త్రి, కనకమేడల వేంకటేశ్వరరావు నారపురెడ్డి భూమిరెడ్డి, మల్ల వరపు విశ్వేశ్వరరావు మున్నగు వారు కూడా ఖయ్యాం రుబాయీలను ఆంధ్రీకరించినట్లు తెలుస్తోంది.

ఇలా రుబాయీ అనువాదం తెలుగులో ఆవిష్కరింపబడింది. రుబాయీకి కావలసింది ప్రధానంగా రాగాత్మకత. అదివున్న దువ్వూరి లాంటి వారే తదనువాదానికి న్యాయం చేయగలిగారు. తక్కిన వారంతా రుబాయి 'స్వరూప' విస్తృతి కోసం తహతహలాడిన వాళ్ళే. ఇందులో నిజంగా పారశీక భాషను తెలుసుకొన్నవారు దువ్వూరి శర్మ, ఆలీ షాలు మాత్రమే. ఖయ్యాం రుబాయీ ఆధారంగా తెనిగించినవారు దువ్వూరి, ఆలీషాలు కాగా తక్కిన వారు ఫిట్జెరాల్డ్ అనువాదాన్ని ఆసరాగా చేసుకొన్న వాళ్ళే. అందు చేత రుబాయీ భావాలు సమగ్రంగా అనువదింపబడ్డాయనడం సాహస మౌతుంది. ఏమైనప్పటికీ ఎంతో ప్రాచీన చరిత్ర ప్రశస్తి గల రుబాయి ప్రక్రియ ప్రాపంచిక భాషల్లో అనువదింపబడినందువల్ల దాని యొక్క అంతశ్చైతన్యం గొప్పదని తెలుగులో మాత్రం కొంత సంతృప్తిగానే అనువదింప బడిందని చెప్పవచ్చు. ఒక విధంగా చెప్పాలంటే రుబాయి కవితా ప్రక్రియ విశ్వజనీన మైనదిగా కనిపి స్తుంది. విశ్వాత్మకు రుబాయి ఒక ప్రతీక!

# కవితావీథి

## నాగలి నవ్వింది

యన్. నాగేందర్‌నాథ్‌రావు

పరిఢవిల్లిన ప్రతినాగరికత
పాదాలక్రింద నలిగిన జీవి
నాగలి
మానవ పరిణామక్రమంలో
అడుగడుగునా తన ప్రాణాలు ధారపోస్తూ
క్రమక్రమంగా మానవజాతిని
ప్రగతిపథంలోకి నడిపించింది
నాగలి
భూమిలోకి దిగగొట్టబడిన
కఠిన పాషాణ మేకులక్రింద

అజ్ఞాతంగా పడిఉన్న జ్ఞానసంపదను
తన క్రూర కోరలతో పెకిలించి
మానవేతిహాసాన్ని
అడుగు, అడుగు
మరొక్క అడుగు—ముందుకు కదిలించింది.

విలక్షణ నాగరికతా సోపానాలక్రింద
విలాసపు భోగభాగ్యాలక్రింద
అధికార మదోన్మత్తతమాటున
ధనదాహపు అహంక్రింద
అడుగున బడిపోయింది
అణగారిపోయింది

ఎండకూ వానకూ తడిసిన నాగలి
స్వార్థానికి, ద్వేషానికి
చితికి,
చివికి పోయింది
క్రుతుప్పు పట్టిపోయింది.
అయినా నాగలికెన్నడూ
వృద్ధాప్యం రాలేదు
అలుపూ, సొలుపూ ఎరగని నాగలి
మృత్యువుకే
మృత్యువుగా నిలిచిన నాగలి
ఎన్నడూ శక్తిహీన కాలేదు.

తనను నమ్ముకున్న వారిని
అశక్తులుగా చేయలేదు

టీచర్, ఎ. హెచ్. యస్. చెన్నంగల గడ్డ, చల్లసముద్రం—507 122

# మూడు కవితలు

శంకరగంటి రంగాచార్యులు

## నభస్సు—మనస్సు

ఆకాశమా! నీదు వైశాల్య మది యెంత?
లోతెంత? ఎరుగుదువ, ఎరుగగలవా, నీవు?
నీ యనంతపు కడుపులో ఖగోళపు ప్రోవు
లెన్ని కలవో, యెరుగుదువ నీవు, తవ్వెంత?

నీ యలవి గాని కడుపున నీదు బ్రహ్మాండ
ములలోన ఒక చిన్న నలుసు, నా యీ భూమి.
అందులో నే నొక్క ప్రాణిని, నరుడను, స్వామి
అన్ని ప్రాణులు! కడు నల్పుడను! నీ చండ
పృథులతకు, నా స్వల్పతకు నడిమి దూరమ్ము
కొలుచుటకు కాదు—అది నిజముగ అపారమ్ము!
కాని నేననుచుంటి—'నీ కన్న నే గొప్ప!'
ఎటులని అడిగెదవా? నేను అదియేల చెప్ప
వచ్చితిని విను: నిన్నువంటి మిన్ను లనంత
ములు ముడుచుకొన గలవు నా మదిని, అదె
వింత!

## స్వామి

స్వామి! ఒక మహా వైణికు పాణి పులక
రించు వీణగా నేను కాలేను సుమ్ము
గొఱ్ఱియల కాచు నొక పేద కుఱ్ఱవాని
ఉబుసు పుచ్చెడు మురళినై యుండనిమ్ము.

స్వామి! పంచమస్వరమున పాడునట్టి
కోకిల నోటకే నోచుకొను సుమ్ము.
కాకినై కావుకా వంచు కేకపెట్టి
చిన్ని పిల్లల ముద మంద చేయనిమ్ము.

స్వామి! తులసి మొక్కగనేను ప్రభవ మంద
యోగ్యుడను కాను సుమ్ము. ఈయుర్వినెల్ల
యెడల పచ్చపచ్చగ వికసించు గడ్డి
మొక్కనై ప్రాణులకు సుఖ మొసగనిమ్ము

స్వామి! సుమరాజ్య రాజ్ఞియౌ పద్మమగుట
నేను తగనట్టి వాడను ఎచట పడిన
అచట వికసించు తంగేడు అలరు నగుచు
పల్లెవడుచు కొప్పున వెల్గ చల్లనిమ్ము.

---

రిటైర్డు హెడ్మాస్టర్, 6/685—ఎ, రామ్‌నగర్, అనంతపురం—515 004.

స్వామి! విశ్వవిఖ్యాతమౌ ప్రౌఢకావ్య
మేను రచియింప శక్తుఁడ కాను సుమ్మ
పామరులు పాడు కొనునట్టి పాట వ్రాయ
గలుగు సామాన్య కవిగాగ వెలుగునిమ్ము.

## పురుషోత్తముడు

ఎఱుకు కులమున పుట్టియు ఎఱుక చాల
కలిగి, ద్రోణుని గురువుగా తలచి' చాప
విద్యనేర్చి, కుడి బొటవ్రేలి నతని
కొసగినట్టి ఆ ఏకలవ్యుండు—త్యాగి

కృష్ణుడిచ్చిన సంపద కింత కూడ
పొగరు చెందక, తనదగు మిగుల పేద
తనము మరువక, ఆది తన తరతరాల
ఆస్తి అని యెంచిన కుచేలుడగు—విరాగి

ధర్మజుని రాజసూయాన తాను అతిథి
జనుల పదపద్మముల కడ పనికి కుదిరి,
ఎట్టి అల్పపు పని నేని ఇష్టపడుచు
సలుపవలెనని తెల్పె కృష్ణపరమాత్మనాడు.

తనదు భార్యను దొంగిలి, తగనిరీతి
తనకు, న ప్రకృతి చేసిన దనుజు దునిమి,
అంతమౌ చావుతో పగలని వచించి
నట్టి శ్రీరాముడే—మహాత్ముడుకద,

నిరూపమాన వీరుండయ్యు, పరమవినయ
ఖనయగుచు వానరులనేన తననుమించి
నట్టి అల్పుడే లేడులేడని వచించి
నట్టి హనుము—వీరులకు సమ్రాట్టు కాదె.

# అమ్మ

చిల్లర భవానీదేవి

ఆరని వేదనతో
అలమటిస్తున్న తల్లిని నేను
అనంత కోటి గాయాలతో
అల్లాడుతున్న అమ్మని నేను!

ఒక్కటైన నా బిడ్డలు
ముక్కలౌతున్నారు.
నా కోసం రగిలిన వారే
నన్నే కాల రాస్తున్నారు

వలసాయి వారిని తరిమేయాలని
ఉరికంబాలెక్కిన వారే,
తన వారిని నరుక్కుంటూ
మారణాస్త్రాలు సంధిస్తున్నారు!

అహింసా మూర్తి పాదాలను
రుధిరంతో అభిషేకిస్తున్నారు!

శాంతి కపోతాన్ని సగంలోనే
దహనం చేసేస్తున్నారు!

గుండెల్ని కలుపుకోవలసినవారు
కుత్తుకల్ని నలుపుకుంటున్నారు.

ప్రాంతీయ పిచ్చికి
మతం మందుకు
కులం కాటుకు
కన్న తల్లి పేగులు
కుళ్ళబొడుస్తున్నారు,
కసాయిల్లా నరుకుతున్నారు!
అందుకే——
ఆరని ఆవేదనతో
అలమటిస్తున్న అమ్మని నేను
అనంత కోటి గాయాలతో
అల్లాడుతున్న తల్లిని నేను!

---

ఇం నెం. 1–2–338/6 గగన్‌మహల్ అపార్టుమెంట్స్, దోమలగూడ, హైదరాబాదు–500 029

# మొఁగలి మొగ్గలు

కీ॥ శే॥ చల్లా నరసింహారావు

ఆ.వె. కుండ లోని దివ్వె కూర్పు దేరికిఁ గాంతి
సెమ్మె మీఁది. దివ్వె చిమ్ము వెలుఁగు;
కవినిఁ బైకిఁదెచ్చి గారవం బీయుఁడా,
సరస విజ్ఞు లార! సౌమ్యు లార!

ఆ వె. మండు టెండలోన మంచి నీరును ద్రాగ,
వెండి బిందె కాదు కుండ కాని;
పదరు కొడుకు కన్న పాలేరు నయమయా;
వేదు లార! శాస్త్రవేదు లార

ఆ.వె. విగ్రహంబు కనఁగ వీథికి నడ్డంబు
దాని కన్న హరిత తరువు మేలు
బ్రతికి, చచ్చి నేత బాధించె దేశంబు
దీను లార యోటు జ్ఞాను లార

ఆ.వె. మంచి రూప మున్న మగవానిఁ గనుగొన్న,
వఱలు కొప్పు సరుదు, పైట సరుదు
ఆడ దాని కద్ది యానంద మోహంబు
సారవేదు లార సరసు లార

# కాలం అంచు మీద

సి. కామేశ్వరరావు

పుష్పం విరజిమ్మిన పరాగంలోని
మధు కణాల్ని గ్రోలుతూ
స్వప్నం తొణికిన సరాగంలోని
అందాల విందారగిస్తూ
పాటలో పరిమళించిన రాగం లా
మాటలో పలుకరించిన అనురాగం లా
అపురూపాకృతిని దాల్చి
కాలం అంచు మీద తేలుతుంటాను.
మనిషికీ మనసుకూ ముడి వేసే
మమతల రస గీతాల లహరిలో జారుతూ
మత్సరాగ్ని జ్వాలలు చల్లార్చే
సమతల జలపాత గమనంలో జాల్వారుతూ
చీకటిని చీల్చే ఉషః కాంతి తేజస్సులా
సిరి వెన్నెల చిలికిన పాల తరగల ఓజస్సులా
అనంత సౌందర్య రాశినై
వెచ్చని పచ్చిక వాడిలో ఆడుకుంటాను
ఉదయించిన తొలి సంధ్యా పులకింతలలో
రవి కిరణ రేణువునై మెరుస్తూ
ఊసులాడిన మలయానిలం గిలిగింతలో
తొలకరి పులకల నవ్వునై విరుస్తూ
మట్టిని ముద్దాడిన స్వాతి ముత్యంలా
మృత్యువును జయించిన నిత్య సత్యంలా
అద్భుత హృదయ వికాస తరంగమునై
ఆకాశపుటంచుల్ని తాకుతాను.
చిరుగజ్జెల మంజుల సవ్వడిలో
రమణీయ గలగల ధ్వనినై నరిసూ
సురుచిర సుందర చైత్రంలో
విరిసిన ప్రకృతి చిత్రమునై పరవశిస్తూ
పెదవులపై సరళ దరహాసంలా
ఎదలోవల తరళ చిరుహాస్యంలా
అపూర్వ భావశోభిత వారాశినై
పిల్లగాలి తెమ్మెరలకు ఊపిరి పోస్తాను.
మురళి పలికిన నాదంలోని
మోహన రాగ ఝరిలో మునుగుతూ
మస్తిష్కాన్ని మేలుకొల్పిన వేదంలోని
భావాతీత గంధాన్ని ఆఘ్రాణిస్తూ
వీరులను అలరించే వీణాధ్వానంలా
విశ్వం గుండెల్లో మానవతా సంధానంలా
అనంత కళా విలసిత కవితా ప్రసూనాన్నై
జన హృదయ పొదరిళ్ళలో పరిమళిస్తాను.

కళ్యాణి సదనం, తిలక్‌నగర్, కాశీబుగ్గ–532 222, శ్రీకాకుళం జిల్లా.

# అక్కన్న మాదన్నలు

కాజ ల

[అక్కన్న మాదన్నలు ఏకోదరులు కారు. వారిరువురి కలయిక దైవఘటన. వారు తానీషా కడమంత్రులై తెలుగుజాతి సంస్కృతిని ఉజ్వలము చేసిరి. రామదాసు పేరున్నంతకాలము అక్కన్న మాదన్నలు స్మరింపబడుచునే ఉందురు.]

ఉ॥ మీదొక వింత స్నేహము సుమీ! యొక
తల్లి యుగన్న బిడ్డలున్
గాదును, రక్త బంధమును గాదును
నొక్కకు లంబు వారలున్
గాదును వేఱ కారణము కన్పడకున్నది
మీదు పేరులే
పాదుక పోమె నొక్కటయి యక్కన
మాదన లార నెమ్మిమై 1

ఉ॥ అన్నము లేదు, త్రావ మధురాంబువు
లైనను లేవు పాపమ
క్కన్న గుణంబు మంచిది యొకప్పుడు
తానును నున్నవాఁడె, లే
కున్నను లేదు లేదనఁడు, గుండె గలా
ఁడాను, "చూచిరందు మా
దన్నటంచు భార్యయని నంతటఁ దాఁ
జెవి యొగ్గె నెట్టులో 2

తే.గీ. మును కుచేలుఁడు కృష్ణు నిఁగనుట
కొఱకు
నరిగి పోయిన యట్టు లక్కన్నగారు
పాలిపోయిన మొగముతో గోలకొండ
కెట్టులో పోయి మాదన్న యిల్లు గనిరి. 3

తేగీ. "అమ్మ మాదన్నగారలున్నారటమ్మ?"
యనినఁ "దానిషా పని మీఁద
నరిగినారు
వచ్చుచుందురు కూర్చుండిచ్చట" నని
వెను దిరిగి లోనికెగె నామె ధ్దరాలు" 5

కం॥ ఓహో! యెవ్వరిబంధువు?
సాహసమున నింట వచ్చి సౌకర్యములన్
బాహాటముగాఁ గొనెనని
యూహింపుచు భార్యతోడ మాదన 6
యనియెన్

తేగీ. ఓసి నీకేమి తావలె, నొంటరిగ మ
నింట నున్నాఁడ 'టన్న' నాకేమికాఁడు
మీకు బంధువటంచు నమ్మితినిఁ జూడ,
నేర యెంతాయెనని యామె యనఁగ
నతఁడు 7

ప్రధానాంధ్రోపన్యాసకులు, నోబుల్ కాలేజ్, చింతలగుంట పాలెం, మచిలీపట్నం—521001

చం॥ వెఱవక ప్రశ్నయొక్కడును వేసెదఁ
జెప్పుడు' నాదునింటి కిం
దఱు చను చంద్రు, బంధువులు,
దారిన తోదురు, కొన్ని నాళ్లకున్
మఱియును మీరలెవ్వరు? ప్రమాద
వశంబున వచ్చినారొ? నా
కెఱుఁగఁగఁ జెప్పరే యనిన నిట్లనె
నక్కనగారు

గే॥ నీవు చిన్నమ్మ కొడుకవు నేనును మఱి,
పెద్ద తల్లి కొడుకుగాన నిద్దఱికిని
గలదు బాంధవ్యమనిన ఆ మాట
కతండు కడుపుబ్బ నవ్వి యనియె

ఉ॥ అన్నవు నీవు, నాకుఁగలదన్నది నీకును
బంచియిత్తు నా
కున్నది నీకు లేవిదని యుండదు,
రాజును గొల్తమన్నన
క్కన్నయు బాగు బాగనె, నొకండు
సుమిత్రుడు గగ్గెనంచు మా
దన్నయు సంతసంపడెఁ ప్రధానులు
వారలు తానిషా కడన్

గే॥ హిందూ రాజ్య రమా దురంధరులు,
సౌహిత్య ప్రియంభావుకుల్
మండీ భూత విపక్షులున్ మతి బలా
మంద ప్రభావోన్నతుల్
సింధూదగ్ర ప్రతాప మూర్తులు సదా
శ్రీమంతులున్ ధర్మమా
ర్గా బద్ధ మనస్కులున్ చెలగి
రా యక్కన్న మాదన్నలున్

# రంగాజమ్మ రచనలు—వ్యాకరణ విశేషములు

తూములూరి పార్థసారథి

తంజావూరు నేలిన విజయరాఘవ నాయకుని (1633–1673) ఆస్థానమునందు రంగాజమ్మ కవయిత్రిగారున్నట్లు సాహిత్య లోకమునకు సుపరిచితమే. మరియు యీమె రచనలలో కేవలము ఉషాపరిణయము, మన్నారుదాస విలాసమను రెండు ప్రబంధములును, మన్నారుదాస విలాసమను నాటకము లభ్యమగుచున్నవి. వీనిలోని వ్యాకరణ విశేషములు ప్రస్తుత వ్యాసములో సమీక్షింప బడుచున్నవి.

ప్రౌఢ వ్యాకరణకర్త 'రో శబ్దం బొండు సంబోధనంబున స్త్రీ వాచకంబునకు బరంబుగ నగు. అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి' అని సూత్రీకరించినారు. బాలవ్యాకరణము యిటువంటి ప్రామాణిక రూపములను సాధించుట కవకాశ మివ్వలేదు.

రా, రో లు చివర చేరిన శబ్దములకు ముందు ఆమంత్రణమున రావలసిన 'ఓ' శబ్దము సామాన్యముగా రాదని చెప్పుటకు అవకాశమున్నది. పై సూత్రమందు శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యుల వారు 'ఒకానొక యాధునిక గ్రంథము నందు అన్నరో, ఏనుంగురో అను ప్రయోగములు కానంబడుచున్నవి. వానికి ప్రామాణిక ప్రయోగములు కానంబడవు' అని తెలిపియున్నారు.

దక్షిణాంధ్రయుగ వాఙ్మయములోనూ యిట్టివి దర్శింపగలము.

'అక్కరో ! నీవేల ; యాక్మలోఁ గలఁగెదు'
(ఉషాపరిణయము—ఆ—1, ప—37)

రంగాజమ్మ పదతికి మారుగా తత్సమానార్థకమగు పణతి శబ్దమును పలుమార్లు తన గ్రంథములలో వాడి యున్నది.

"బాణ నందన కప్పు పణఁతు లందుఁబు గూడి
(ఉ.ప, ఆ—2, ప—38)

"పతి జూపులప్పు డప్పణఁతి లావణ్యాబ్ధి"
(మ.దా.వి.ప ఆ—5, ప—45)

తోడుత అనునది వ్యస్తపదము, తోడుతో అను తృతీయా విభక్తి ప్రత్యయమునకు మారుగా నగును. తోడుతో అనునవి 'తోడుత' నుండి

యేర్పడెననియు, తొలుతటి రూపము 'తోడుత' అనియు, అర్థవంతములైన శబ్ద భాగముల యక్షరములు లుప్తమై క్రమక్రమముగా ప్రత్యయము లేర్పడెనని స్పష్టపడును

ప్రౌఢ వ్యాకరణకర్త ఒకానొకచోఁ దోఁడకుఁ దోడుత యని రూపాంతరంబును గలదు; అయినను దానికి వలె దీని కితర కార్యంబు గలుగదు' అనిరి. తోడకు వచ్చు లోపము, వ్యవహితమై యుండుట మున్నగు నితర కార్యములు మాత్రము 'తోడుత'కు రావని పిండితార్థము, భాగవత పద్య భాగమును ప్రామాణికముగా చూపి యున్నారు. ఇట్టి ప్రయోగములు రంగాజమ్మయు చేసి యున్నది.

'ప్రియమా తోడుత నేఁబూని పెండ్లిసేయ'
(మదావి ప్ర,ఆ–4 ప–51)
'ముచ్చట మీర నాకలను మోహముతోడుత'
(ఉ-ప,ఆ–1,ప–65)
'హరి తోడుత నీ కార్యము'
(ఉ-ప-ఆ–3,ప–110)

బాల వ్యాకరణమున నిత్యైక వచనాంతము లేవో, నిత్య బహువచనాంతములేవో వివరింపబడక పోవుటతో ప్రౌఢ వ్యాకరణ కారులు కొన్ని యాటలను తెలుపు పదములను నిత్య బహు వచనాంతములనుటకు వీలుగా 'క్రీడా విశేష వాచక శబ్దములును' అని చెప్పి యున్నారు. బొమ్మ 'పెండ్లిండ్లు' అను ఉదాహరణ మిచ్చుచూ ఒకానొక కవి యిందుఁ గొన్నిటి నేక వచనాంతములుగాఁ బఠించి యున్నాడు, అది విచార్యమనిరి.

'విజయ రాఘవ మహీవిభుని బెండ్లాడు చే,
చెలగె బొమ్మలపెండ్లి సేసినటు' (మదావి)
(ప్ర, ఆ–2 ప-63)

'పరగ గుజ్జెన గూళ్ళు నిచ్చెలులతోడ
బేర్వేర బొమ్మల పెండ్లిసేయు
వెన్నెల బైటను గున్నియలు దాను
మునయుచు, దాఁగిలి మూతలాడు'
(ఉప ఆ–1,ప–24)

'తమలపాకు' అను అర్థములో' తెలనాకు, తెల్లనియాకు' అను ప్రయోగములు రంగాజమ్మ గ్రంథములలో కానవచ్చుచున్నవి.

తెల్లనాకు = తెల్లని సన్నని తమలపాకు.
తమలపాకు వర్ణము ఆకుపచ్చ!

'హొసఁగఁదెల నాకు కవిరెలు పోఁక ముల్లు'
(ఉప,ఆ–2,ప–95)
'తెలనాకు కట్టలను బోఁకలయక్కును బాణ
వ్రతికిన్' (ఉప,ఆ–3,ప–85)
'తెల్లని యాకుల కవిరెలు' (మదావిప),
ఆ–5,వ–62)

రంగాజమ్మ కొన్ని శబ్దములను రకరకాలుగా పల్టీలు కొట్టిస్తూ ఆడుకున్నది. అందులో 'పలుమారు' యొకటి. చివరి యక్షరముల లఘు, శకట రేఫములుగను, ఒక్కొక్కచో అచ్చుల మధ్యలో లుప్తమై సంయుక్తాక్షరమగుటను, లేక దీర్ఘమైన అక్షరమును హ్రస్వముగా చేయుటయును కానవచ్చును. ఈ క్రింది యుదాహరణముల పరిశీలింపుడు.

''చెలియతో బలుమారు సేయకుము వాదులను''
(ఉ.వ, ఆ–2, ప–8 రగడ)
''అనాథు బలుమరు నాత్మలో దలపుచు''
(ఉ.ప, ఆ–1, వ–69)
''పలుమరుఁదాను గన్నకల భావములోపల నెంచి చూచుచున్''
(ఉ.ప, ఆ–1, ప–51)

''పద్మరు సుజనాధ్భతికిన్
వాల్మీకి వ్యాస ముఖ్యవర కవి తతికిన్.''
(మదాలిప), ఆ–1 ప–20)

''వెలది పల్కు–లు పలుమారు పినక యహహ'
(మదానిప్ర, ఆ–4, ప–4)

చిన్నయసూరి బాలవ్యాకరణములో ''యుస్మ దాత్మార్థకంబుల కుత్తర పదంబు పరంబగునపుడు దుగాగమంబగు'' అని సూత్రీకరించియుండెను. దీనివలన కొన్నియెడల దుగాగమంబు వచ్చుటయు, కొన్ని చోట్ల రాకుండుటయు జరుగవచ్చును.

''చింతింపంగ దొలంగె దనదు చిత్తము
లోనన్''
(మదావిప్ర, ఆ–3. ప–72)

''ముదము తోడుత నాదు ముచ్చట దీరంగ''
(ఉ.ప, ఆ–1, ప–56)

''నేర్పున నీడెద నెలంత యిచ్చోటను.''
ఉ.ప, ఆ–2, ప–12)

''బానరా నీదు చక్క–దనంబెల్ల వీనుల విందుగ్గా వినుచుం జొక్కితిన్''
(మ.దా.వి.నాటకము)

బాలవ్యాకరణమందు చిన్నయసూరి ''దిక్కు–లోనగువాని చాకు దకారంబు విభాషనగు'' అని అభిప్రాయపడెను. రంగాజమ్మ ప్రయోగించిన ల ల పరిశీలింపుడు.

''అతివ దాగిలి ముచ్చలాట లాడుదమన్న''
(ఉ.ప, ఆ–2, ప–37)

''వెన్నెల బైటను గన్నియలుందాను
మొనయుచు దాగిలి మూతలాడు''
(ఉ.ప, ఆ–1, ప–37)

''మనసిజ సూను నెత్తుకొని మాధవునిన్ గనకుండ దాగెనో!''
(ఉ.ప, ఆ–3, ప–109)

చిన్నయసూరి బాలవ్యాకరణములో ''ద్విప్రభృతి సంఖ్యావాచకంబులు ప్రథమాంతరంబులు వక్కాణించెద'' ననుచూ ''ఇన్ని ప్రభృతులు సర్వనామంబులు'' వివరణములో మహదర్థమున ఇద్దఱు, ఇరుగురు అని చూపియున్నారు. ఏవిధముగా సాధింపనగునో వివరింపలేదు. కాని ప్రౌఢ వ్యాకరణకర్త శబ్దపరిచ్ఛేదములో ''ర్య,రవర్ణంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు'' అను సూత్రములో 'ఇరుగురు'కు సాధన యివ్వబడెను. పిదప ''ఒకానొకచో నిరుగురున కిద్దఱా దేశంబగు'' నను దానిచే 'ఇద్దఱు' సాధింపబడెను. కాని ఇరువురు ఇర్వుల సాధనకు మార్గమును వ్యాకరణ కర్తలు సుగమము చేయలేదు ఇరువురు, ఇరువురన్ అనియు చెప్పవచ్చును. అను వ్యాఖ్యానములే మిగిలినవి. 'వెంట తీసుకొనవచ్చుట' ను అర్థములో 'తోడితెచ్చు' ప్రయోగములు

''అతని దోడైవచ్చి నినుం గూర్చు, ననుచుం
బల్కు–''
(ఉ.ప ఆ–1, ప–53)

''సరగున నది తోడి తెచ్చి సముఖంబు
సతన్''
(మదావిప్ర, ఆ–3, ప–53)

'వద్దకు' పర్యాయముగా 'వద్దికి' 'వగిది'కి మారుగా 'వగుది' ప్రయోగములను రంగాజమ్మ గ్రంథములలో చూడవచ్చును.

'అల్లుని వద్దికి నంత నెంతయు' (మదావిప్ర, ఆ-5,ప-84)

'చిత్రరేఖ యనిరుద్ధుని నుష వద్దికి జేర్చుట' (ఉ.ప పుట 64)

'పగిది బెట్టించుకొవలె బాగు మీర" (మదావి ప్ర. ఆ-5,ప-70)

''పాపముల్ పూజించు పగుది నుండె" (మదావి ప్ర, ఆ-5,ప-45)

వ్యాకరణకర్త 'ద్వంద్వం బ్రాహ్మణి వాచక కృదంత శబ్ద ఫంచితం బేక వచనాంతంబు నగు' నంచూ కూరగాయ, రేపగలం మొదలగు ప్రయోగముల జూపిరి. ఉషా పరిణయములోని ప్రయోగము యీ కోవకు చెందినదే

''ఇరువురము యేము రేబగ వెనసియున్న'
లెనసియున్న'
(ఉప, ఆ-3, ప.65)

''బహుత్వంబున మే కు నే విభాషనగు'' నని త్రిలిఙ్గ లక్షణ శేషకారులు సూత్రీకరించి యున్నారు. అనగా 'మేము'కు బదులు నేము రావచ్చును.

''నేము ఒగ్గర రాంగ నెంతయుఁ బ్రేమచే' (మదావి ప్ర. ఆ-4, ప-25)

పై సూత్రమునకు పూర్వ సూత్రములో నీ మీ నే మే హల్లులకు లోపంబు విభాషనగు' నని' చెప్పబడియున్నది. మేము లోని హల్లు వికల్పముగా లోపించి 'ఏ' యేర్పడునని అర్థము. అట్టి ప్రయోగ మున కుదాహరణము ''ఎనయన్నీ చరితంబు లే మెఱుగము యే కార్యముల్ జేసినన్' (ఉ.ప, ఆ-1, ప-42)

''అనుర నీకొనరించునప్పుడేము'' (ఉ.ప, ఆ-1, ప-8)

''కొన్ని యెడల మహద్వంద్వంబునం బూర్వ పదాంత్య స్వరంబునకు దీర్ఘంబునుం జూపెట్టెదు'' అను సూత్రములో మొదటిపదమే చివరియచ్చునకు దీర్ఘము వచ్చు సందర్భములకు తల్లీదండ్రులు, అన్నాదమ్ములు, అప్పాచెల్లెండ్రు ఐక్యము నివ్వ బడెను. అట్లు రాని మరియు ద్విత్వలకారము రాని ప్రయోగమును పరిశీలింపుడు.

''తనకు నే వస్తువుల్ తలిదండ్రులంపిన'' (మదాలి ప్ర, ఆ-3, ప-24)

''చిట్టడవిఁ జిట్టి'' అను ప్రౌఢ వ్యాకరణ సూత్రములో విపర్ణమున"హల్లు పరంబగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికంబు'' అని వ్రాయుచూ చిట్టితాళము, చిటితాళము రూపము లివ్వబడెను.

''చిటి తాళము రమయు శేషనాదం బు..
(ఉ. ప, ఆ-2, ప-4)

''కొందఱు భద్రదరంబగు భాగవతముద్ర వహించి చిటితాళము లెగర వైచి'' (మాదావి ప్రి, ఆ-4(, వచనము- 67)
చిట్టి తాళమనియ రావచ్చును,

నవ్వుటాల, నవ్వులాటలు సమానార్థక పదములు, నవ్వులాట ప్రయోగమును కావించిన విధమును చిత్తగింపుడు.

''నవ్వుటాలకును నాథుం దల్లినం జూపె'' (ఉ. ప, ఆ-2, ప-50)
ఇట్టిదే మరియొక్క విశేషము.
''కంతు తనయుని గానక కళవళమున''
(ఉ-ప,ఆ-3, ప-10)

''హాదులయు నీటుగు లోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగనగు" నను సూత్రమునను గురించి యీ క్రింది ప్రయోగములు కాన వచ్చును.

''పడతి యొక్కతె హడపంబు బాగుగ(బూని'
(ఉ,ప,ఆ–2,ప–90)

'పొలతి యొక్కతె యడపంబు( బొసగ( బట్టె" (ఉ,ప, ఆ–2,ప–3)

'జలజాక్షి నంగ సంకర్షణుబు ముగురు నిస్తంద్ర శక్తిన్"
(ఉ.ప, ఆ–4,ప–8)

నే(డిపు డెవ్వరో ముగురు నిస్తుల దీప్తి
(ఉ–ప,ఆ–4,ప-33)

'రు,ర వర్ణ కంబులు పరంబులగునపుడు సాధారణంబుగ సంఖ్యావాచకంబులకు గువర్ణంబు పూర్వాగమంబగు' అను ప్రౌఢ వ్యాకరణ సూత్రముచే మూ(డు X గు X రు అగును.

పిదప 'సంఖ్యా వాచకంబులకు విభక్తి పరంబగునపుడు కొన్నింటి యంత్యాక్షరంబులకు లోపంబగు, అను ప్రౌఢవ్యాకరణ నియమముచేత 'మూగురు' అయినది.

అ తర్వాతి 'విభక్తి పరంబగుచో మూ(డు నాలుగుల దీర్ఘంబునకు హ్రస్వంబు బహుళంబు గానగు' నను సూత్రముచేత 'ముగురు' అయినది.
''వనజాక్షి !యిటకు( బడినా(వదువేల యోజనముల'' (ఉ, ప, అ–2, వ–75)
బాలవ్యాకరణములో పదునొకటి వదునొకటిఅనురూపములు చూవ బడినవి, ప్రౌఢ వ్యాకరణ కర్తయు 'ఒకంద్వాదులు పరంబులగుచో(అడుగనుస్ బడికగు'' ని వదునొకండు రూపమునే చూపిరి, ప్రౌఢ వ్యాకరణ మతము ననుసరించి పది + ఉన్ + ఒకండు = పదు నొకండు; కాని ప్రస్తుత యుదాహరణము తద్భిన్న మైనది

''సమానాధి కరణంబగు నుత్తర పదంబు పరంబగునపుడు మూ(డు శబ్దముడు వర్ణంబునకు లోపంబును పొంది హల్లునకు ద్విత్వంబునగు" నను సూత్రములో చిన్నయసూరి ''ముజ్జగములు' అనుపదము నుదాహరణములలో చేర్చిరి.

"ముజ్జగంబుల (గలవారి మూర్తులెల్ల'' (ఉప ఆ–3 –26) ఇచ్చటి 'ముజ్జంగంబుల' అనునది కేవలము ముద్రణా దోషము మాత్రమే పైపద్య పదము గీతమునకు చెందినది, దీని లక్షణమునను సరించి పై 'ముజ్జంగంబుల' లోని మొదటి పూర్ణాను స్వాలముండకూడదు

''ముజ్జగంబుల గల్గిన ముదిత లెల్ల,, (ఉ–ప ఆ–2, ప–98)

ఈ విధముగా ప్రామాణిక వ్యాకరణ నియమములను దాదాపు రంగాజమ్మ తన గ్రంథములతో పాటించి యున్నది.

''రచనా సౌలభ్యమునకై ఔచిత్యమును బట్టి కొన్ని వ్యాకరణ నియమములను ఉల్లంఘించిన స్వతంత్రులనం వారే" అని దక్షిణాంధ్రయుగ విశిష్టతను గూర్చి ఆంధ్రవాఙ్మయ స్థూల రూపములో శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు తెలిపి యుండిరి. అయితే యీ యుల్లంఘనా వైపరీత్యము యే కావ్యయుగములో నైనా కనిపించక తప్పదు. దానికి ప్రౌఢ వ్యాకరణకర్త యొక్క యీ సూత్రమే ప్రమాణము.

'కవిత్రయేతర ప్రయోగంబులం గొన్ని యెడలని ప్రత్యయాదులు పరంబులగునపుడు పకారంబిందుకు కారణంబున కెనింగానంబడదు.'

అట్టి ప్రయోగములుండుట చేతనే వ్యాకరణ నియమములలోను సవరణలు ఆవసరమెచ్చినవి. అట్టిదే గదా ప్రౌఢవ్యాకరణము!

'ప్రయోగ శరణం వ్యాకరణం'

7-70/1, చైతన్యపురి,
హైదరాబాద్-500 036.

# నన్నయ్య వ్యక్తిత్వము

గుండి రామ్‌కుమార్

## నన్నయ్య వ్యక్తిత్వము

శ్రీవాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖా
జ్గేషుయే
లోకానాం స్థితిమావహన్త్య విహతాం, స్త్రీ
పుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రీ పురుషాస్స
మ్పూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ
శ్రీకన్దరా శ్శ్రియసే.

అని నన్నయ మంగళప్రయోజనమై ఆశీ రూపముగా నున్న సంస్కృత శ్లోకమును తన భారతారంభమున రచించినాడు. ఆశీస్సు దేవ భాషా ప్రయుక్తమగుట మంగళావహమను విశ్వాసము ప్రాచీనుల కెక్కువగా కలదు. ఈ సంస్కృత శ్లోకము శార్దూల వృత్త లక్షణములతో నొప్పుచూ నన్నయ మార్గ కవితాభిమానమును వ్యక్తము చేయును మరియు గీర్వాణభాష పైన తనకు కల గౌరవమును ప్రకటితమగును.

ఇదా సంస్కృత మంగళ ముతో కావ్యమును ప్రారంభించిన నన్నయ కావ్య ప్రారంభమున కొత్త అవతారికను కల్పించెను. ఈ యవతారిక రచనా పద్ధతి తర్వాత కవులకు ఒక అవర్జనీయమైన సాంప్రదాయముగా నేర్పడినది శ్రీకారముతో కావ్యము నారంభించుట యిష్టదేవతా స్తుతి, కృతిభర్తృ, కృతికర్తృ, వంశవర్ణనలు, గ్రంథప్రాశస్త్య నిరూపణము మొదలగు విషయములు అవతారికలో కల్పించుట అనూచానమగు సంప్రదాయమైనది.

భారత రచనలో ఆయా పాత్రల వాక్క్రియాధికము వలన నన్నయ వ్యక్తిత్వమును నిరూపింప వచ్చును

నన్నయ భారతావతారికలో తన వ్యక్తిత్వ సంబంధిత పదములో తన గోత్ర విషయమును విద్యావిజ్ఞాన విశేషములను, ఆచార స్వభావములను సూచించు ఒక సీస పద్యమును ప్రథమ పురుషలో ఇట్లు వ్రాసినాడు.

సీ. తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమ తత్పరు వైపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాన నిరతు
పాత్రు నాపస్తంబ సూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞునుభయభాషా కావ్యరచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు

ఆ. నిత్యసత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుం జూచి
పరమ ధర్మవిదుడు వర చాళుక్యాన్వయా
భరణుడిట్లనియె గరుణతోడ (ఆది/-9)

పై పద్యమును బట్టి నన్నయ వేదోక్త ధర్మమును అత్యంత శ్రద్ధగా కఠోర దీక్షా దక్షతతో నాచరించుచున్నాడని, లోకజ్ఞుడని, నిత్యసత్య వ్రత దీక్షాబద్ధుడని తెలియుచున్నది.

నన్నయ కఠోర ధర్మ నిష్ఠ కలవాడు. ధార్మిక జీవనమును అతనికి అతని కవిత్వమునకు జీవగర్ర. ధర్మమునకు హానికరమైన వాక్కును అతడు వినలేడు పలుకలేడు. 'నీవును బ్రహ్మచారివి నేనును కన్యకను వివాహము నీకునాకు మున్ భావజ శక్తినైన యది వన్నుగ నన్ను బరిగ్రహింపు' మని దేవయాని చెప్పినపుడు కచుడు అత్యంత విషాదాకులుడై 'లోకనింద్యమగు నర్థము నీ వాక్కునకు దెచ్చుటుచితమె, నాకు సహోదరివి నీవు నాచిత్తమునన్' అని మందలించినట్లు నన్నయ వ్రాసినాడు. గురుపుత్రిక సోదరి తుల్యమనే ధర్మవాక్కును ఇట పలికించినాడు. నన్నయ ధర్మవాక్కులనే పలుకుతాడన్న మాట అటుంచి తన పాత్రలతో కూడా ధర్మబద్ధమైన వాక్కులనే పలికించిన నన్నయ వ్యక్తిత్వము ప్రశంసించ దగినది

నన్నయ భారతరచనలో. పాత్రల సంభాషణలో, ఉపదేశములలో కూడా మనసుకు ప్రియమైన, హితమైన ధర్మయుతమైన మాటలే పలుకవలెనని యయాతి పూరుడికి చేసిన ఉపదేశములో ఇట్లు చెప్పినాడు.

'మనమునకు బ్రియంబును హిత
మును బథ్యము దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరగ బలుకునది ధర్మయుతముగ సభలన్'.

మనసుకు ప్రియముగాను, హితంగాను, రుచికరంగాను, నిజంగాను, ఉచితముగాను, మధురంగాను, పరిమితంగాను ఉండేమాటలే మాట్లాడాలి. సభలో ఈ మాటలన్ని ధర్మయుతంగా కూడా ఉండాలి కావున నన్నయ పాత్రల సంభాషణలో మితమైన, ధర్మయుతమైన మాటలే పెక్కు చోట్ల కనబడును.

భారతములో కర్ణజన్మ వృత్తాంతము నన్నయ ఆది పర్వమునందు కలదు. కుంతీ సూర్యుల సంభాషణలో మితమును చూపినాడు. దూర్వాసుడిచ్చిన దివ్యమంత్రశక్తి నెరుగదలచి కుంతి 'నాకు నిమ్ము ప్రియమ్మున నీయట్టి కొడుకు' నని సూర్యునికి మ్రొక్కును. సూర్యుడు తన తేజోరూపమును చూచి విస్మయమును, భయమును పొందుచున్న కుంతిని 'ఓడకుండు' మని ప్రసన్నుడై 'నీకోరిన వరంబీ వచ్చితి' ననును.' అప్పుడు కుంతి లజ్జావదనయై తన అపరాధమును సహింపుమని సూర్యునికి మ్రొక్కి 'ఏను మంత్రశక్తి యెఱుగక కోరితి గన్య కిదియు గుణముగాదు. నాక, నాకు గర్భమయిన నా తల్లిదండ్రులు జుట్టములను నన్ను జూచి నగరె (ఆది 5–24) నేను నీ మంత్రశక్తి గురించి తెలుపక వరమిమ్మని కోరితిని, కన్యనైన నాకు గర్భమైనచో నా తల్లిదండ్రులు బంధువులు నన్ను జూచి నవ్వగలరు. అని ధర్మమునకు వెరచి పలికినది ఇందు కుంతి పలికిన ప్రతిమాట మనసుకు ప్రియంగాను, మితంగాను ధర్మయుతముగా నున్నది. ఇక్కడ నన్నయ కుంతిని వెరద స్వభావురాలుగాను, కల్లాకపటము ఎరుగని అమాయక ప్రకృతి కలదిగా చిత్రించినాడు. ఇట్లు మితముగా సాగిన కుంతీ సూర్యుల సంవాదము నన్నయ గాంభీర్యమునకు, ధర్మదృష్టికి ఉన్నతవ్యక్తిత్వమునకు అగియున్నది.

నన్నయ సద్గుణావదాత చరితుడు, నిత్య సత్యవచనుడు. సుజనుడు, వినయ సంపన్నుడు. నిత్యసత్యవచనుడైన నన్నయ తన జీవితంలో సత్య వాక్కులను పలుకడమే కాక తన పాత్రలను కూడా సత్యవాక్య పాలకులుగా చిత్రించినాడు.

ఉదంకుడు తక్షకుని వలన బాధలు చెంది పగతీర్చుకొనుటకై జనమేజయ మహారాజు కడకు సర్పయాగ ప్రేరణార్థము వెళ్ళినపుడు అతనిని 'మితహితసత్య వాక్యజనమేజయ' అని సంబోధించినాడు. ఇక్కడ నన్నయకు గల సమయస్ఫూర్తి కూడా ఎంత చక్కనిదో తెలియుచున్నది. ఏమిటంటే ఒక వ్యక్తి ఎదుటవ్యక్తి దగ్గరకు వెళ్ళి వారి మనసును ప్రియమైన మాటలతో సంబోధిస్తూ సమయస్ఫూర్తితో తమ కార్యమును సాధించుతారు. ఇక్కడ ఉదకుండు కూడా జనమేజయుని కడకు సర్పయాగ ప్రేరణార్థము వచ్చినాడు. కావున ఆ పనిని జక్కపెట్టుటకొరకే నన్నయ జనమేజయుని సత్యవాక్య పరిపాలకునిగా సంబోధింపచేసినాడు. సత్యవాక్కుపై నన్నయకు గల అభిమానము ఇటను స్పష్టము సత్యార్ధమైన వాక్కుల నుచ్చరించడమే కష్టము. అట్టి వాక్కు సత్యమైనదే కాక మితమును హితమునగుట ఇంకా కావల్సినదేమున్నది వాక్కులలో హితత్వము, మితత్వము, సత్యమున్నచో ఆ వాక్కుకన్న గొప్పదేది? ఇట్టి వాక్కులు నన్నయకు మిక్కిలి ప్రీతి పాత్రములు అందుకే 'తనకుల బ్రాహ్మణు' మె పద్యములు నన్నయ వ్యక్తిత్వమునకు దర్పణములగుచున్నవి.

తనకుల బ్రాహ్మణుడైన నన్నయ బ్రాహ్మణ ఆచారములను తన జీవితములో పాటించడమే కాక అట్టి యాచారములను తన పాత్రలలో కూడ పొందుపరిచినాడు. ఏమిటంటే మూల భారతము నందలి పాత్రలు మద్య మాంసాదులను సేవించినట్లు కలదు. కాని కుల బ్రాహ్మణుడైన నన్నయ వాటి పట్ల విముఖుడగుట వలన తన పాత్రల చేత కూడా మద్య మాంసాదులను నిషేధింప చేసినారు.

ఏక చక్రపుర బ్రాహ్మణుడు భీమునకు పెట్టిన ఆహారము మూలమునందు ఈ విధముగానున్నది.

"పిశితో దనమాజహ్రు రథాస్మై పురవాసినః
సమ్మృతం సోపదంశఞ్చ సూపైర్నానా
వెధైస్సహ
తదాశిత్వా భీమసేనో మాంసాని వివిధానిచ'

అని కలదు కాని అనువాదమున నన్నయ భీమునకు మాంసపువాసననైన చూపలేదు. భీముని చేత నన్నయ అచ్చపు బ్రాహ్మణ భోజనమునే తినిపించినాడు. చూడుడు—

'వలుదెలగుల పిండి వంటలు పప్పు
గూడును నేయికుం ।
దలు గుడంబు దధి ప్రపూర్ణ ఘటంబులుంగొని
వచ్చియాన్.' (ఆది 6-291)

పప్పులు నేయి మొదలగు వాటిలో కూడు కొనిన పిండి వంటలనిన బ్రాహ్మణులకు మిక్కిలి ప్రీతి. అట్టి వాటిపై ప్రీతిగల నన్నయ భీముని చేత కూడా అటువంటి భోజనమునే తినిపించినాడు. మూలమునందు మద్య మాంసాదుల ప్రసక్తి ఎచ్చట వచ్చినను వానిని పరిహరించుటను బట్టి కుల బ్రాహ్మణుడైన నన్నయ ఎంత సత్యమూర్తియో పరమ నైష్ఠికుడో విదితమగుచున్నది. అంతే కాక మరియు బ్రాహ్మణులు భోజనము చేయునపుడు గాయత్రీ మంత్రమును చ్చరించుచూ యాచమించుట యాచారము కలదు ఆయాచారమును భీముని చేత కూడా చేయించినాడు. భీముడు యమునా తీరమున బండి నిలిపి బకాసురుని పిలుచుచూ అతడు వచ్చునంతకు మిన్నకుండా కాళ్ళు చేతులు గడిగి కొని యాచమించి యాశకటంబుపై కూడు గూడ్చుచుండె నని నన్నయ ఆమూలకముగా చెప్పినాడు. దీనిని బట్టి నన్నయ ఆచారవంతుడనుట స్పష్టమగుచున్నవి

భారతావతారికలోని క్రింది పద్యమును నన్నయ వినయ సంపదను తెలుసుకొనవచ్చును.

"అమలిన తారకా సముదయంబుల నెన్నను
సర్వవేద శా
స్త్రముల నశేషపారము ముదంబున బొందను
బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారత
భారతీసము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను
నేరఁబోలునే" (ఆది 1–19)

స్వచ్ఛమైన నక్షత్రముల సమూహమును లెక్కించుట ఎంత కష్టమో అదే విధముగా సర్వ వేదశాస్త్రముల సారాంశమును తెలుసుకొనుట సాధ్యం కాదు. సముద్రము నీదుటకు భుజబలము ఎంత అవసరమో భారతమనే సముద్రమునీదుటకు బుద్ధి బాహువనే బలము కావలెను అయినను భారత సముద్రాన్నీదడము బ్రహ్మకైనను సాధ్యమా? అని అనిన నన్నయ పలుకులలో అతని వినయ తత్వము కనబడుచున్నది. ఎందుకంటే కొందరు అల్పజ్ఞానము కలిగినవారు పండితులమని విర్రవీగువారు కాని నన్నయ భారత భారమును మోయుటలో ప్రతిభ కలవాడైనప్పటికీ, భారత సముద్ర మునీదుటకు సాధ్యము కాదనినాడు. 'నిండుకుండ తొణకదు' అను సామెత ఇక్కడ నన్నయపట్ల చక్కగా తగియున్నది. పై విధముగా నన్నయ పలికడము వలన అతని వినయ విధేయతలిందు ప్రస్ఫుటమగుచున్నవి.

పై విధంగా అనిపిమ్మట నన్నయ రాజుతో 'అయినను దేవానీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి వానేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెదనని (ఆది–1–20) అనుటచే అతనికి గల సుధీజన విధేయత సుస్పష్టమగుచున్నది.

మరియు నన్నయ వ్యక్తిత్వమునకు సంబంధించిన మరొక విషయము భారతావతారిక యందు కాననగును,

"పాయక పాకశాసనికి భారత ఘోర
రణంబు నందు నా
రాయణునట్లు ధరామర వంశవిభూష
ణుండు నా
రాయణ భట్టు వాఙ్మయ ధురంధరుడుం
దనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాడభిమతంబుగ దోటయి
నిర్వహింపగన్'(ఆది 1–24)

భారత యుద్ధమునందు అర్జునుని కృష్ణుడు యుద్ధోన్ముఖులు చేసి ఆయుధము ధరించకనే అన్ని విధాల సహాయపడినట్లుగా బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైనవాడు, భాషలో పరిజ్ఞానం కలిగినటువంటి వాడు తనకిష్టుడైనవాడు. తనకు సహాధ్యాయుడగు నారాయణభట్టు ఘంటము చేత పట్టగానే భారతరచనలో తనకవిహితమయ్యేవిధముగా అన్ని విషయములలో సహాయపడినందులకు హృదయ పూర్వకంగా అతనికి కృతజ్ఞత తెలిపిన కృతజ్ఞుడు నన్నయ భట్టారకుడు.

ఇట్లే విధముగా భారత రచనలో కథాగమనమునకు నిరోధము కలుగకుండ ఔచిత్య దృష్టితో మార్పులుచేసి తన వ్యక్తిత్వమునకు అనుసంధానముగా కావ్యములోని పాత్రలు వ్యక్తిత్వమును కూడా ఉన్నతముగా తీర్చిదిద్దినన నన్నయయు మరియు —

'జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడ
దెనుగున రచియింపు మధికధీ యుక్తి మెయిన్
(ఆది 1–16).

అని ఆంధ్ర సాహిత్య సామ్రాజ్యమునకు పునాది వేయడానికి కారకుడైన రాజరాజు ఇరువురు కూడా అజరామరులై యశశ్శరీరులై ఆచంద్రార్కము అశేషాంధ్ర హృదయ పీఠముల. సుప్రతిష్ఠితులై వెలసియుండగలరు.

# పుస్తక సమీక్ష

## బూడిద
### (నవల)

స్త్రీ పైన అత్యాచారం జరిపిన పురుషుడు న్యాయ స్థానం కళ్ళ నుంచి తప్పించుకుంటే- ఏ నేరం చేయని వాడుగానే చలామణి అవుతాడు. కాని ఆ స్త్రీని మాత్రం సమాజం వంకర చూపుతో చూస్తుంది. ఇందుకు తట్టుకోలేక అబలలు ఆత్మ హత్య చేసుకునే సందర్భాలున్నాయి.

ఈ పరిస్థితిని చిత్రించే నవల శ్రీ సిహెచ్. వేణు రాసిన బూడిద. మానస, పద్మజ, కావేరి కాలేజీ విద్యార్థినులు. మంచి స్నేహితులు. హాస్టల్ లో వుంటున్నారు. స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళి తిరిగి వస్తుండగా ఈ ముగ్గురిపైన అయిదుగురు దుండగులు అత్యాచారం జరుపుతారు. ఈ అవమానం భరించలేక పద్మజ ఆత్మహత్య చేసుకుంటుంది. పెళ్ళి తర్వాత ఈ సంగతి తెలుసుకున్న భర్త అనే మాటలు పడలేక కావేరి కూడా ఆత్మహత్య చేసుకుంటుంది. అభ్యుదయ భావముగల యువకుడు మానసను ఈ సంగతి తెలిసినా-పెళ్ళి చేసుకునేందుకు సిద్ధపడతాడు. ఒకసారి మానస కూడా ఆత్మహత్యకు యత్నిస్తుంది. బ్రతికి బయటపడుతుంది. అయినా పెళ్ళి మాత్రం చేసుకోనంటుంది.

ఈ విషాద కథను నవలగా మలచడంలో శ్రీ వేణు ప్రదర్శించిన నేర్పరితనం ప్రశంసనీయం. ఉద్విగ్నతతో చదివించే నవల యిది.

రచన : శ్రీ సిహెచ్. వేణు,
పేజీలు ; 76, వెల ; రూ. 15/-
ప్రతులకు ; రచయిత C/o సూర్యోదయ ప్రింటర్స్ హైదరాబాద్ రోడ్, నిజామాబాద్- 503 001.

జె. రామకృష్ణారావు

కాశము చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుతూ తీర్మానించడమైనది.

### తీర్మానము –8

ద్వితీయ భాష హిందీని ప్రస్తుతమున్న ఆరవ తరగతి నుండి కాక అయిదవ తరగతి నుండియే ప్రారంభించ వలసినదిగ సమావేశము ప్రభుత్వము వారిని కోరుతూ తీర్మానించడమైనది.

## హిందీ ప్రేమీమండలి, గుంతకల్లు

1994 సంవత్సరం జనవరి నెల 10వ తేదీ గుంతకల్లు హిందీ ప్రేమీ మండలి సాధారణ సభ్యుల సమావేశము. హిందీ స్వర్ణ జయంతి భవనమున శ్రీ.వంకదారు రామకృష్ణయ్య గారి అధ్యక్షతన జరిగినది. సమావేశములో 1993 సంవత్సరమునకు సంబంధించిన కార్య వివరముల నివేదికను. మండలి ఆదాయ వ్యయములను గూర్చి కార్యదర్శి శ్రీ కే. గంగిరెడ్డిగారు చదివి వినిపించిరి తదనంతరము 1994 సంవత్సరమునకు నూతన కార్యనిర్వాహక సభ్యులు ఎన్నికయి క్రింది విధముగా జరిగినది.

అధ్యక్షులు:- శ్రీ.వంకదారు రామకృష్ణయ్యగారు ఉపాధ్యక్షులు:– యన్. విరూపాక్షరెడ్డి గారు. శ్రీ ఆర్. రామవరెడ్డి గారు, కార్యదర్శి:–శ్రీ. కే. గంగిరెడ్డి గారు, సహాయ కార్యదర్శి:–శ్రీ. కె. శివారెడ్డి గారు, శ్రీ యం. రాజశేఖర్ గారు కోశాధికారి:- శ్రీ టి. జీవన్ గుప్త గారు, కార్యవర్గ సభ్యులు:- శ్రీ డి. వక్కిరప్ప గారు, శ్రీ. వై. వెంకటస్వామి గారు, శ్రీ కే. రామస్వామి గారు. శ్రీ.యం. వెంకట నారాయణ చౌదరి గారు, శ్రీ య. డి. జాఫర్ గారు, శ్రీ టి.ఎమ్.నాగశయనం గారు. శ్రీ బి. ఎమ్. చన్న బసయ్య గారు, శ్రీ.డి. శ్రీనివాసాచారిగారు.

## హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవం- రాజాం.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆధ్వర్యమున నడుపబడుచున్న ప్రాథమిక, మధ్యమ మరియు రాష్ట్రభాష ప్రమాణ పత్రములు. తేది 26–1–94 రిపబ్లిక్ దినోత్సవ సందర్భమున కాలేజికి ముఖ్య అతిధిగ ఆహ్వానించ బడిన శ్రీ కె.వి. రమణమూర్తి, రాజాం గారిచే పిల్లలకు అందజేయబడినవి హిందీ ప్రాశస్త్యమును వారు నొక్కి వక్కాణించిరి తొలత శ్రీపి. మురళీధర్, ప్రిన్సిపాల్ గారు జెండా ఎగరవేసిరి. ఆ పిమ్మట ఎన్. ఎస్. ఎస్ ఆటల బహుమతులతో సహా శ్రీబి. ఉమామహేశ్వరరావు. హిందీలెక్చరరు రాజాం మరియు సభ కార్యవర్గ సభ్యులు హిందీ ప్రమాణ పత్రములు (14 ఫిబ్రవరి 93 సం॥లో జరుపబడిన పరీక్షలు, ప్రాథమిక 33 మధ్యమ 23 రాష్ట్ర భాష 13 మొత్తం 69 ప్రమాణ పత్రములు శ్రీ కె.వి. రమణ మూర్తిగారు రాజాంవారి సౌహార్ద్రముతో ఒసంగ బడినవి.

## అమృతోత్సవ పరీక్ష ప్రమాణపత్ర వితరణోత్సవము, రామచంద్రాపురం

తా. 17.1.94 న రామచంద్రాపురం కేంద్రమునందు దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు ద్వార జరుపబడు అమృతోత్సవ పరీక్షయందు ఉత్తీర్ణులైన విద్యార్థులకు బి. హెచ్. ఈ. ఎల్. హయర్ సెకండరి స్కూల్ ఉప ప్రధానాచార్యులు శ్రీ ప్రసాదు రావు గారు ప్రమాణ

పత్రములు వివరణ చేసినారు. వేదమంత్రములతో కార్యక్రమము ఆరంభించ బడినది. విద్యాలయ హిందీ విభాగ అధ్యక్షులు శ్రీ యం. రఘుపతి గారు వందన సమర్పణ చేసినారు. విద్యార్థుల జాతీయ గీతముతో కార్యక్రమము ముగించ బడినది.

## అమృతోత్సవ పరీక్ష ప్రమాణపత్ర వితరణోత్సవము

ది: 18-1-94న సికింద్రాబాదు కేంద్రము నందు దక్షిణభారత హిందీ ప్రచారసభ ద్వారా అమృతోత్సవ సందర్భములో జరుపు పరీక్షయందు ఉత్తీర్ణులైన విద్యార్థులు మరియు యువకులకు ప్రమాణ పత్ర వితరణోత్సవ కార్యక్రమము జరుపబడినది. కార్యక్రమమునకు శ్రీ ఆర్. కృష్ణమూర్తి, లు సికింద్రాబాదు ఆర్య సమాజము వారు అధ్యక్షత వహించినారు.

కార్యక్రమము శరత్ హిందీ విశారద విద్యాలయము విద్యార్థుల వేదమంత్రములతో ఆరంభించబడినది. విశారద విద్యాలయ ఆచార్యులు శ్రీ యం. రఘుపతిగారు విద్యాలయ వివరణ సమర్పించినారు. అధ్యక్షులవారు విద్యార్థులకు ప్రమాణ పత్రములు వితరణ చేసినారు. ఈ సందర్భములో హిందీ ప్రచార, ప్రసారమునకు శ్రీ రఘుపతిగారి సేవలగురించి ప్రశంసించినారు. విద్యార్థులకు హిందీ భాషయొక్క ప్రాముఖ్యమును వివరించినారు. కుమారి యం. ఆర్. పద్మజ వందన సమర్పణతో కార్యక్రమము ముగించ బడినది.

## సంతాపం

శ్రీమతి కూరెళ్ళ సరస్వతీ దేవి గత నలభై సంవత్సరముల నుండి హిందీ భాషా ప్రచారము చేయుచూ హిందీ భాషా సేవలోనే తమ చివరి శ్వాస 13-10-1993 న ఉదయం 7-37 ని॥ లకు రాజమండ్రిలో తమ నివాస గృహములో విడిచిరి.

పరీక్షా విభాగము:

### మారిన ఛూట్ శుల్కం వివరములు.

| | |
|---|---|
| మధ్యమ మరియు రాష్ట్రభాష నుండి చూట్ తీసుకొనుటకు శుల్కం | రూ॥ 25/- |
| ప్రవేశిక నుండి చూట్ అనుమతి కొఱకు శుల్కము | రూ॥ 50/- |
| రా. భా. విశారద నుండి చూట్ ,, | రూ॥ 60/- |
| రా. భా. ప్రవీణ నుండి ,, | రూ॥ 100/- |

ఈ మార్పు 1994 ఆగస్టు పరీక్షల నుండి అమలు లోనికి వచ్చును.

కార్యదర్శి.

# ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి

## వార్షిక సమావేశము



ది 23-1-94న జరిగిన ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి వార్షిక సమావేశములో చిత్తూరు జిల్లా సీనియర్ ప్రచారకులు మరియు సంగఠకులు శ్రీ జె. దొరస్వామిరెడ్డి గారిని ముఖ్య అతిథులు, ఆంధ్రసభ అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు, ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ కాజ వెంకటేశ్వరరావు గారు, శ్రీ కుసుమ హరనాథశర్మ గారు, ప్రచారక మండలి ప్రధాన కార్యదర్శి శ్రీ బి. అంజయ్య గారు, ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ అ. శంకరశాస్త్రి గార్లు సన్మానించుచున్నారు.

**Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D.B. Hindi-Prachar Sabha- Andhra. Khairatabad. Hyderabad-500 004.**
**and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad-500 004**